# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras.} Regd. No. M. 1118 Vol. 36 No 239 FRIDAY 2nd DECEMBER 1949 వెల ఒక అణా } Founder: K. NageswaraRao

# భారత రిపబ్లిక్ పరిగణనకు బ్రిటిష్ ప్రభుత్వ ప్రత్యేక శాసనం

## ఫ్రెంచి ఇండియా భూభాగాలలో మార్చినెలలో జనవాక్య నిర్ధారణ

### తేదీ నిర్ణయం విషయమై త్వరలో భారత ప్రభుత్వానికి ఫ్రెంచి ప్రభుత్వ వర్తమానం

పుదుచ్చేరి, నవంబరు 30: దక్షిణ భారత దేశంలో ఉన్న నాలుగు ఫ్రెంచి భూభాగములలోను ఫ్రెంచి ప్రభుత్వం వచ్చే మార్చిలో జనవాక్య నిర్ధారణ జరపదలచినదని విశ్వసనీయంగా తెలియవచ్చింది.

అయితే, జనవాక్య నిర్ధారణ తేదీని స్థిరంగా నిర్ణయించే ముందు ఫ్రెంచి ప్రభుత్వం భారత ప్రభుత్వంయొక్క అనుమతినికూడ పొందవలసి ఉంటుంది; కాబట్టి ఫ్రెంచి ప్రభుత్వం త్వరలోనే ఈ విషయమై భారత ప్రభుత్వమునకు తన అభిప్రాయములను అధికారరీత్యా తెలియజేసి, తేదీ విషయమై సంప్రతించగలదు.

ఓటర్ల పట్టీలను తయారుచేయడానికి ఫ్రెంచిఇండియా ప్రభుత్వం త్వరలోనే ఒక ప్రత్యేక ఉత్తరువును జారీచేయగలదనీ, ఈపని ఇదివరకులాగా మునిసిపల్ కౌన్సిళ్ళకే అప్పగించబడుననీ, పట్టీలను ...

... లు ఇంకాతీరలేదు. ఫ్రెంచి ప్రభుత్వానికి చెందిన ఉన్నతాధికారులు వాస్తవిక దృష్టిని అవలంబించి ఉభయదేశాల మధ్య సామరస్య సద్భావాలు నెలకొల్పవలసిన ఆవశ్యకతను గమనించినందున ఈ సమస్య ... త్వరలోనే పరిష్కారం కాగలదని నా నమ్మకం."

సర్దార్ మాలిక్ ఇండియా ప్రభుత్వంతోను ఉద్యోగులతోను సంప్రతింపులు జరిపి కొద్దిరోజులు సెలవుమీద కాలక్షేపంచేసి, పారిస్‌కు 1950 సంవత్సరారంభంలో తిరిగి వస్తాడు.

### కరైకల్‌లో దుష్ప్రచారం

### సర్దార్ మాలిక్ విజ్ఞప్తి

## కామన్సులో నోయెల్ బేకర్ ప్రతిపాదన: తొలి పరిశీలన సమాప్తి

### బ్రిటన్‌లోని భారతీయుల ఆస్తి పౌరహక్కుల రక్షణ సదుపాయం

### కామన్వెల్తు సభ్యత్వంపై త్వరలో రాజు ఉత్తర్వు

లండన్, నవంబరు 30: ఇండియన్ రిపబ్లిక్‌ను గుర్తించేందుకుగాను బ్రిటిష్ ప్రభుత్వం నేడు పార్లమెంటులో ఒక బిల్లును ప్రవేశపెట్టింది.

ఇండియా ఒకమూల కామన్‌వెల్తులో వుంటూ రిపబ్లిక్ రాజ్యంగా అవతరించనున్న అవసరాన్ని పురస్కరించుకొని దానికి సంబంధించిన వ్యక్తులపట్లను, వస్తువులపట్లను అనువర్తించే న్యాయ సూత్రాలు యథాతథంగా వుండేటట్లు చూడడానికి మాత్రమే ఈ బిల్లు ఉద్దేశించబడిందని అధికారవర్గంవారు వర్ణించారు.

బ్రిటిష్ మంత్రివర్గంలో కామన్‌వెల్తు సంబంధ శాఖామాత్యులు ఫిలిప్ నోయల్ బేకర్ నేడు ఈ బిల్లును పార్లమెంటులో ప్రతిపాదించారు. బిల్లుమీద ఎటువంటి చర్చ లేకుండానే మొదటి పరిశీలన పూర్తి అయింది.

... పార్లమెంటు ఆమోదానికి తెచ్చి, స్టాట్యూట్ పుస్తకంలో చేర్చాలని ప్రభుత్వం ఆశిస్తున్నది.

ఈ బిల్లుయొక్క పూర్తిపాఠం:—

క్లాజు (1). ఇండియా త్వరలో రిపబ్లిక్ రాజ్యంగా అవతరించబోతున్నది. ఇప్పుడు ...

(2-వ పేజీ చూడుడు)

## "లేనిపోని నినాదాలతో మన నాయకులను కలత పెట్టవద్దు"

### ఉత్కళ ప్రజలకు రాజాజీ ఉద్బోధ: తపస్సుద్వారా శీలం పునరార్జించాలని హితవు

కటక్, నవంబరు 30: గవర్నరు జనరలు రాజగోపాలాచారిగారు నేడిక్కడ భారత రాజ్యాంగాన్ని గురించి మాట్లాడుతూ, అది కేవలం ఒక ఉపకరణంవంటిదనీ, దానిద్వారా భారతీయులు ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించాలని అన్నారు. ఆయన తమ ప్రసంగంలో ఇంకా ఈ విధంగా చెప్పారు. మనకు గనులు, జల ...

... ఆ తరవాత గవర్నరుజనరలు అనేక దేశాల్లో భారత రాయబార ...

2-వ పేజి చూడుడు

## గుల్బర్గజిల్లా కాంగ్రెసు ఎన్నికల తగాదా

### రాష్ట్రపతి తీర్పుకు వదలివేయుటకు సంస్థానకాంగ్రెసు కార్యవర్గనిర్ణయం

### డిసెంబరు 15న హైద్రాబాద్ కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికలు

హైద్రాబాద్, నవంబరు 30: హైదరాబాద్ సంస్థానకాంగ్రెసు కార్యవర్గం వారు నేడు రెండుగంటలసేపు సమావేశం జరిపి, సంస్థానకాంగ్రెసులో సంఘ ఎన్నికలవల్ల ఉద్భవించిన విభేదాలను భారత జాతీయకాంగ్రెసు అధ్యక్షులు డా॥ పట్టాభి సీతారామయ్యగారి తీర్పుకువదలివేయుటకు నిశ్చయించారు. ఆయనతీర్పు ...

... న్నవి. ఇంతవరకు పరిష్కారం కాని సమస్యలన్నిటిని గురించి సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షపదవితో సహా ఒక నిర్ణయానికి రావటానికి పథకం తయారు చెయ్యబడిందని, తెలుస్తున్నది.

ఉభయపక్షాలకు అంగీకారమైనవానినే సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనుటే అవసరమనే భావం బయలు ...

... అంగీకారం కుదిరిన వెంటనే; బిందు, రామకృష్ణారావుగార్లు ఢిల్లీవెళ్ళి యీ విషయాన్ని భారత ఉపప్రధానికి తెలియజేస్తారని భావించ బడుతున్నది.

## శాంతినికేతనంలో ప్రపంచ సౌమనస్య సమావేశం

### పశ్చిమబెంగాల్ గవర్నర్ డా॥ కట్జూగారి ప్రారంభోపన్యాసం

కలకత్తా, డిశంబర్ 1: 'ఇంగ్లండు గనుక, తనకు తానే, ముందుగా, ఆయుధ విసర్జనం చేస్తున్నట్లు ప్రకటించగలిగితే దానివల్ల మహత్తరమైన ప్రతిఫలం చేకూరుతుంది.' అని డాక్టర్ కె. యన్. కట్జూ ఈ వేళ యిక్కడ శాంతినికేతనంలో జరుగుతున్న ప్రపంచ సౌమనస్య సంఘ సమావేశం ...

(6 వ పేజీ చూడుడు)

## ఫ్రెంచివలసమెడగాస్కర్‌లో 13మంది భారతీయులపైదేశబహిష్కారఉత్తర్వు

### పార్లమెంటులో విదేశశాఖ సహాయ మంత్రి డా॥ కేస్కార్ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 1: భారత ప్రభుత్వ విదేశాంగ వ్యవహారశాఖా సహాయ మంత్రి డా॥ బి. వి. కేస్కార్ యీవేళ పార్లమెంటులో, ఆర్. కె. సిధ్వా ప్రశ్నకు సమాధానమిస్తూ మడగాస్కర్ ద్వీపం ...

... వచ్చిన భారతీయులు, ప్రభుత్వానికివిన్నపములు పంపుకొన్నారు. వ్యక్తులకుసంబంధించిన కేసులు, మడగాస్కర్‌లోని బ్రిటిష్ కౌన్సల్ ద్వారానూ ఢిల్లీలోని ఫ్రెంచి ...

(2-వ పేజి చూడుడు)

## రజ్వీనివిచారిస్తున్నసంఘంమినహాగా హైద్రాబాద్‌లో డిసెంబరు15నుండి ప్రత్యేకన్యాయవిచారణసంఘాలరద్దు

హైద్రాబాద్, నవంబరు 30: సయ్యద్ కాశిం రజ్వీని విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘం మినహాగా మిగిలిన విచారణ సంఘములన్నిటినీ డిసెంబరు 15 నుండి రద్దుచేస్తూ, హైద్రాబాద్ ప్రభుత్వం ...

## పోస్టు కార్డు వెల

ఢిల్లీ, నవంబరు 30: ఇండియా గవర్నమెంటుయొక్క పోస్టు కార్డులు కవర్లు ఎంతకు అమ్మబడుచున్నవో అంతవలకే హైద్రాబాదు సంస్థానంలో కూడా అమ్ము ...

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 1:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎక్స్చేంజి సెల్సుటాక్సుతో సహా రు. 77-0-0 వెలి బంగారు తులం 115-4-0 మాసబంగారు 113-12-0 సీమవెండి తులం 100-కి (గెడి 172 0-0 వెండి తులం 1 కి 1-12 6

వేరుసెనగ: (581 తా 1-కి ఎక్కు కోస్తాసిద్ధంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా): జానువారి 159-8-0, 160-0-0 (కోరమాండల్)

వేరుసెనగనూనె ఎక్స్‌పెల్లర్ (డీవలి డిసెంబరు ఆఖరువరకు రు. 322 33; 388, 8 టు 5% యుఫ్. యఫ్. ఎ, సెంట్రాయిను (87 [illegible] జబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిటీ. రు. 87-0-9

### ఆముదం

కాండీ 600 పౌనులుగలది చిల్లరగా
రు. 285 (నరసరావుపేట)
రు. 260 (ఒంగోలు)

### పంచదార

| | | |
|---|---|---|
| నర్కటియాగంజ (2 అందరు) | | రు. 94-7-10 |
| హసన్‌పూర్ | ,, | రు. 93-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-9-5 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 30:

డిసెంబరు 29.97 / 29.97 మార్చి 29.97 / 29.97 మే 29.93 / 29.94 జూలై 29.64/29.64 అక్టోబరు 28 11బిడ్ 28.13 అస్కుడ్ డిసెంబరు 28.05 బిడ్ 28.07 అస్కుడ్ మార్చి 27.99 బిడ్ 28.00 అస్కుడ్ మే 27.94 బిడ్ 27.96 అస్కుడ్

| | | |
|---|---|---|
| ఫ్యూడింగ్ | బొజరు | 30.63 |
| మార్చి | (గరిష్ఠధర) | 29.98 |
| ,, | (కనిష్ఠధర) | 29.91 |



## కాశ్మీర్ సమస్య

### షేక్ అబ్దుల్లా లేక్‌సక్సెస్ ప్రయాణం

జమ్మూ, నవంబరు 30: 'నేను లేక్ సక్సెస్ వెడుతున్నది భద్రతా మండలి నుంచి న్యాయం జరుగుతుందనే ఆశతో గాదు; సత్యాన్ని జగత్తుకు తెలిపేందుకు వెడుతున్నాను' అని కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా ఈవేళ యిక్కడి జమ్మూలో జరిగిన విద్యార్థుల సమావేశంలో ప్రసంగించారు.

'ఇక్కడ భద్రతామండలి వల్లగాని, మరే యితర సంస్థవల్లగాని మనకు సంపూర్ణమైన న్యాయం లభిస్తుందని కాశ్మీర్ వాసులెవ్వరూ ఆశించటానికి అవకాశం లేదు. పరస్పరం ఐక్యతతో సంఘటితులమై, కాశ్మీర్ వాసులంతా ఏకంగా నిలిచి, యే మహాదర్శాలకొరకు ఇన్ని రోజులుగా పోరాడుతున్నామో వాటిని విడువకుండా పోరాడగలిగినప్పుడే మనకు జరుగవలసిన సంపూర్ణ న్యాయాన్ని మనం సాధించ గలుగుతాం.

'కాశ్మీర్ గడ్డమీద జరుగుతున్న ఈ సమరం కేవలం రాజ్యకాంక్షతో జరుగుతున్నది కాదు. ఒక మహాసిద్ధాంత స్థాపన కోసం జరుగుతున్నది. మహాత్ముడు ప్రబోధించిన సోదరత్వ సత్యసిద్ధాంతాల స్థాపన కోసం జరుగుతున్నది. కాశ్మీర్ ఈ మహాసిద్ధాంతాలకు ప్రతిమూర్తిగా నిలబడ గలిగినందుకు మనమంతా గర్వపడవలసివుంది.

కాశ్మీర్ లౌకిక ప్రజాస్వామికానికి ప్రతిబింబం. మహాత్ముని సిద్ధాంతాలకూ నవ కాశ్మీర్ సిద్ధాంతాలకూ అవినాభావం వుండటంచేతే మనం భారత దేశంతో పొత్తుకలుపుతున్నాం. కాశ్మీర్ భారత దేశములమధ్య పెంపొందిన యీ ఐక్యత ఆచంద్రతారార్కం వుంటుంది. ప్రపంచంలోవున్న యే మహాశక్తీ దీన్ని నిర్మూలించలేదు' అని షేక్ అబ్దుల్లా ప్రకటించారు.

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 3 శనివారం

### మద్రాసు (ఎ)

ఉ 7-30 చంద్రాసంపత్ పాట. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయసంగీతం (రి) 8-30 మద్రాసు (బి) వలె. మ 1-0 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి) 4-0 పిల్లల కార్యక్రమం. ఆంగ్లమున సా. 5-30 టి. ఎస్. గోపాలకృష్ణయ్యర్ పాట 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 రాజం వైద్యనాథన్ పాట. 7-0 వడకంచేరి రామభాగవతర్ పాట. 7-30 గీతమంజరి (రి) 7-45 మైసూర్ టి. చౌడయ్య వయొలిన్. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 వరద నివారణ సహాయ చర్యలు. హాన్. సీతారామరెడ్డి ఆంగ్లప్రసంగం. 9 30 ఆంగ్ల ప్రసంగం. 10-0 పాశ్చాత్య సంగీతం (రి)

### మద్రాసు (బి)

ఉ 7-0 తెలుగున వార్తలు. 7-15 ఎస్. వి. పార్థసారథి రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె 8-30 బాలానందం నిర్వహణ. న్యావతి కామేశ్వరి. మ 1-0 మహిళామండలి. లక్షణమైన కాపురము. జీవితములో పూర్ణ్వాసక్తి. ప్రసంగం. ఎ. గిరిజవీణావాద్యం. మహిళాలోకం. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 4-0 మద్రాసు (ఎ) వలె. సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామీణుల కార్యక్రమం ప్రాచీన భారత రాజ్యాంగ నియమాలు ఎన్నిక పద్ధతులు సంభాషణ. భావరాజు వెంకట కృష్ణరావు అంభియపాటి వీరరాఘవులు 7 తెలుగున వార్తలు 7-15 కొబ్బరి తోటల పెంపకము. ప్రసంగం. పాలంకి వెంకట రామచంద్రమూర్తి 7-45 మద్రాసు (ఎ) వలె. 9-30 సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ రికార్డులు. 9-15 జి. సుబ్బలక్ష్మి ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా. 10. శాస్త్రీయ సంగీతం (రి).

### విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 ఎస్. వి. కట్టప్ప రికార్డులు. 7-30 ఘంటసాల [illegible] వెంకటసుబ్బారావు. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 [illegible] పాటలు. 8 [illegible]. 8-30 కన్నన్ వేణు మ 1- [illegible] (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు. 4 [illegible] పంట [illegible]. [illegible] సా 5-30 [illegible] వెంకట సుబ్బారావు 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి టి. సూర్య కుమారి రికార్డులు. 6-30 గ్రామీణుల కార్యక్రమం (మద్రాసునుండి) 7 తెలుగున వార్తలు. 7-30 [illegible] 7-45 మద్రాసు వలె 9 ఆంగ్లమున వార్తలు 9-15 మద్రాసు వలె. 9-30 నావసు (రి) 9-40 బుచ్చిరాజు అప్పారావు [illegible]. ఎం. అప్పారావు ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా.

## భారతీయులపై బహిష్కార ఉత్తరువు

(1 వ పేజి తరువాయి)

త్యానికి కొన్ని వార్తలు అందినవి. నీటి విషయమై ప్రభుత్వం వ్యాఖ్య చేస్తున్నది. మడగాస్కర్‌లో భారతీయులు మంచిజీవితాన్నే నడుపుతున్నారు. కొందరు వ్యవసాయము, మరికొందరు వ్యాపారం వృత్తిగా జీవిస్తున్నారు."

అక్కడి భారతీయుల యోగక్షేమాలను కనిపెడుతూ ఉండుటకు మడగాస్కర్‌లో కాన్సలర్ కార్యాలయాన్ని నెలకొల్పడం అవసరమా కాదా అనే విషయం విచారించి తెలిపేందుకు, ప్రభుత్వం, దక్షిణాఫ్రికాలోని తమ ప్రతినిధిని మడగాస్కర్‌కు పంపించినది."

ఫ్రెంచి న్యాయశాస్త్రం ప్రకారం, ఫ్రెంచి భూభాగంలో పుట్టి 21 ఏండ్ల వయస్సు గలవారు ఫ్రెంచి పౌరసత్వం పొందవచ్చు. అయితే వారందరినీ, సైన్యంలోకి సమీకరించే అధికారం ఫ్రెంచి ప్రభుత్వానికి ఉన్నది. అక్కడ కొందరు భారతీయులు ఫ్రెంచి పౌరసత్వం సంపాదించుకొన్నారు." అని కేసాకర్ తెలియజేశారు.

## యంత్ర పరికరాల ఉత్పత్తి ఫ్యాక్టరీ

### స్విస్ కంపెనీతో ప్రభుత్వ ఒడంబడిక

యంత్ర పరికరాలను ఉత్పత్తి చేసే ఫ్యాక్టరీని నెలకొల్పేందుకు, స్విస్ కంపెనీతో ప్రభుత్వం ఒడంబడిక చేసుకొన్నదని ఈ ఫ్యాక్టరీ 16 కోట్ల రూపాయల పెట్టుబడితో నెలకొల్పబడుననీ, యిందులో 10% ను స్విస్ కంపెనీ యిస్తుందనీ, పరిశ్రమల శాఖా మంత్రి శ్యామప్రసాద్ ముఖర్జీ యివ్వాళ పార్లమెంటులో తెలియజేశారు. సున్నితమైన తరిసెన యంత్రాలు, మర బరమాలు బోరింగ్ యంత్రాలు తదితర పరికరాలు, యీ ఫ్యాక్టరీలో తయారు చేయబడును. ఇవి యింతవరకూ, ఇండియాలో తయారు చేయబడటంలేదు. 10 యేండ్లలోగా యీ ఫ్యాక్టరీలో నాటికి 85 మంది భారతీయులే ఉద్యోగాల్లో ఉండేందుకు, తగిన ఏర్పాటు యివ్వబడును" అని ముఖర్జీ అన్నారు.

కొన్ని ఉపప్రశ్నలకు సమాధానమిస్తూ యీ ఫ్యాక్టరీ మైసూర్‌లో నెలకొల్పబడుననీ, యిందుకు కావలసిన భూమినిగూడా ప్రభుత్వం కొన్నదనీ, 1950 నుంచి ఫ్యాక్టరీ నిర్మాణం ప్రారంభం కావచ్చునని తెలియజేశారు "ఈ ఫ్యాక్టరీ నిర్మాణం 5 ఘట్టాలలో జరుగుననీ, ఆరేండ్లలోగా ఫ్యాక్టరీ పూర్తి అయి ఉత్పత్తి ప్రారంభమగుననీ, తయారైన వస్తువుల అమ్మకం మీద స్విస్ కంపెనీకి 4% నుంచి క్రమేణా 2% తగ్గేటట్లు రాయల్టీ యివ్వబడుననీ చెప్పారు. ప్రభుత్వ వ్యయకర్తృత్వ విధానం యీ ఫ్యాక్టరీ నిర్మాణానికి వర్తించదనీ అన్నిటికంటె దీనికే తొలి ప్రాధాన్యత యివ్వబడినదనీ, గవర్నరు శాఖవారు మైసూర్‌లో స్థాపించదలచిన ఫ్యాక్టరీ దీనికి అనుబంధంగా ఉంటుందని శ్యామప్రసాద్ ముఖర్జీ నొక్కిచెప్పారు.

## భారత రిపబ్లిక్ పరిగణన: బ్రిటిష్ పార్లమెంటులో బిల్లు

(1 వ పేజి తరువాయి)

ఆ దేశం ప్రజలపట్ల, వస్తువులపట్ల ఒకవిధమైన న్యాయసూత్రం ఇచ్చట అవలంబనీయంగావుంది. కాబట్టి, ఇండియా రిపబ్లిక్ అయిన తరువాతగూడా అదే సూత్రం వాటిపట్ల అనువర్తిస్తుంది. కాని ఆ సూత్రాన్ని ఇందులో 3 వ అంశంలో చెప్పిన విధంగా అధికారవర్గం త్రోసివేస్తే త్రోసివేయవచ్చును. అప్పటి ఇండియా రిపబ్లిక్ కాకయుండగు ఏ న్యాయసూత్రం దానిపట్ల అనువర్తిస్తూనున్నదో, అది న్యాయసూత్రం అవుతూ వాలిదగా అనువర్తిస్తూ వుంటుంది.

క్లాజు (2):- ఈ చట్టం, ఒక ప్రదేశంలోగాక, దాని తాలూకు [illegible] రక్షిత రాజ్యాల్లోను, [illegible] ప్రాంతాల్లోను కూడా [illegible] వుంటుంది. కాని వర్తీంచే [illegible] మాత్రం ఆ దేశంలో ప్రస్తుతమున్న న్యాయసూత్రం [illegible] అనువర్తిస్తుంది.

ఇందులో మహాన్యాయమైన నలవ, దక్షిణ రాజ్యం, [illegible] ప్రాంతం అనేనాటికి 1948 బ్రిటిష్ [illegible] చట్టాన్ని బట్టి [illegible] చేసుకోవాలి.

క్లాజు (3):- బ్రిటిష్ [illegible] రాజు తన మంత్రివర్గంతో సంప్రదించనవసరము లేకుండా ఇండియా రిపబ్లిక్ రాజ్యాంగా అంగీకరిస్తున్నా, కౌన్సిల్ [illegible] ఉంది. దాన్ని [illegible], ప్రస్తుతం అమలులోవున్న న్యాయసూత్రాన్ని అందుకు అనుకూలంగా సవరిస్తూ, ఆర్డర్-ఇన్-కౌన్సిల్ జారీ చేయవచ్చును. అప్పుడు అది ఇందులో 1 వ ఉపాంశం, అనిసంగా సవరించబడిన న్యాయసూత్రం పట్లనూ వా అనువర్తిస్తుంది. ఆ ఆర్డరులో ఇంకో విధంగావుంటే మాత్రం అనువర్తించదు.

ఇక రాజుగారు ఆ ఆర్డర్-ఇన్-కౌన్సిల్‌ను ఇండియా రిపబ్లిక్ అయిన తరువాత అయినా జారీ చేయవచ్చు; లేదా అంతకుముందే జారీ చేయవచ్చు. ఆ తరువాత దాన్ని ఇంకో ఆర్డరుతో రద్దు చేయనూవచ్చు; మార్చనూవచ్చు.

(బి) పార్లమెంటు తాలూకు రెండు శాసనసభలు ఒక తీర్మానంద్వారా ఆ ఆర్డర్‌ను రద్దు చేయవచ్చు.

క్లాజు (4):- ఈ ఆర్డర్-ఇన్-కౌన్సిల్‌లో పార్లమెంటు ఫండు లోనుంచి గాని, బ్రిటన్‌యొక్క సమిష్టి నిధిలో నుంచిగాని లేక వాటిమీద వచ్చిన ఆదాయంలోనుంచిగాని ఏమన్నా ఇవ్వాలని ఉదహరించినట్లయితే, అట్టి మొత్తం ఆ ఉదహరించిన కాతానుంచే గ్రహించబడుతుంది.

నోయల్ బేకర్ నేడు ఈ బిల్లును పార్లమెంటులో ప్రతిపాదించినపుడు దేశీయశాఖా కార్యదర్శి జేమ్సు ఛూటర్ ఈడే, అటర్నిజనరల్ సర్ హార్ట్‌లీషా క్రాస్‌లు ఆయన్ను బలపరిచారు.

## బ్రిటిష్ పార్లమెంట్ రద్దు సమస్య

లండన్, డిసెంబరు 1: నిన్న కామన్స్ సభలో భారత రిపబ్లిక్‌తో బ్రిటిష్ సంబంధాలను నిర్దేశిస్తున్న బిల్లు ప్రతిపాదన కావటంవల్ల జనవరిలోనే ప్రస్తుత పార్లమెంటు రద్దుచేయబడి, కొత్తఎన్నికలు జరుగుతవా అన్న అనుమానం కలుగుతున్నది. జనవరి 26 వ తేదీలోపుగా ఈబిల్లు ఆమోదం పొందవలసివచ్చటికి, ఎవ్వరికీ అభిప్రాయభేదాలు లేనందువల్ల జనవరి మొదటివరకు నిలిపివుంచుతారని భావించబడినది. కాని ఇప్పుడే దానిని ప్రతిపాదించటం జరిగింది కనుకనూ, ప్రభుత్వ కార్యక్రమంలో అట్టే చివరిదికనుకనూ దీనినికూడా వెంటనే ఆమోదింపజేసి పార్లమెంటును రద్దుచేసే విషయమై ప్రభుత్వం ఆలోచించవచ్చునని భావించబడుతున్నది.

కాని కొందరి అభిప్రాయాన్ని పట్టి ఎన్నికలు ఫిబ్రవరి చివరలోనో మార్చి మొదట్లోనో జరగవచ్చునని తెలుస్తున్నది. (గ్లోబ్)

## రాజాజీ ఉద్బోధ

(4 వ పేజీ తరువాయి)

కాంగ్రెసువాళ్ల యీ ఉద్యోగాల్లో ఎక్కువగా ఉంటున్నారనే విమర్శన ఉన్నదనీ, అయితే వీరు చాలా అవసరమనీ, భారత ప్రభుత్వం చాలా పొదుపుగా ధనం వినియోగిస్తున్నదనీ చెప్పారు.

ఆ పిమ్మట కాంగ్రెసు కర్తవ్యాన్ని గురించి మాట్లాడుతూ రాజాజీ ఇలాగ చెప్పారు. "కాంగ్రెసు స్వాతంత్ర్య సంపాదనకోసం ఏర్పడినది. ఇది ఒక మహావృక్షం వంటిది. ఈ కాంగ్రెసు వృక్షం మనకందరికీ అనేక విధాలుగా ఉపయోగిస్తున్నది మనం అందరము ఈ మహావృక్షాన్ని ప్రాణప్రదంగా కాపాడాలి."

ఆ పిమ్మట గవర్నరు జనరలు ఇప్పుడు భారత ప్రభుత్వం నిర్వహిస్తున్నవారు చాలా సమర్థులనీ, ప్రపంచంలో అందరు వీరిని చాలా ప్రశంసిస్తున్నారనీ, వారికి మనం ఇంకా ఎక్కువగా సేవాకాలం ఇవ్వాలనీ అన్నారు.

అనంతరం గవర్నరు జనరలు ఒరిస్సా ప్రధాని హరేకృష్ణ మెహతాబ్‌కు అభినందన సంపుటం బహూకరిస్తూ, ఆయన సర్వసమర్థులనీ, ఒరిస్సాలో అంతటా సుపరిపాలన, న్యాయము, పరిశుభ్రత నెలకొల్పుతున్నారనీ అన్నారు.

అనంతరం రాజాజీ మెహతాబ్ స్వర్ణజయంత్యుత్సవ సంచికలో ప్రసంగిస్తూ ఇలాగ చెప్పారు. "దేశంలో ఎక్కడను నల్చినా మన స్వాతంత్ర్యం విషయమై మహోత్సాహం కనిపిస్తున్నది. అయితే పెద్దవారిలో అనేక విషయాలలో అంతో కొంత నిరాశ కనిపిస్తున్నది. మన స్వాతంత్ర్యం నైతిక స్వాతంత్ర్యం వంటిది. నైతికశక్తి సంకల్పం పోయినట్లైతే మనకు విదేశ దాస్యం కొనసాగుతోయుండె. అయితే ఇంతమాత్రం చేతనే మనం పరిగణించలేము. మనం అభివృద్ధి సంపన్నతను పొందించి, అందరికీ సమానంగా పంచాలి. అప్పుడు గాని మనకు నిజమైన ఆనందం కలగదు.

మనకు ఇప్పుడు, జలశక్తి ఉన్నాయి. ఇవి నిజంగా బంగారంవంటివి. మనం ఈ సహజ సంపత్తుల అభివృద్ధి పొందించాలంటే చాలాకాలం పట్టవచ్చును.

ఈ సంపదను వృద్ధి పొందించడానికి శిలసంపద కావాలి. శిలసంపద సహజ సంపదలకంటె ఎక్కువ కిల్లు మహత్తర మైనది."

గవర్నరు జనరలు తమ ప్రసంగం ముగిస్తూ ఈ విధంగా చెప్పారు. "మనకు స్వాతంత్ర్యము వచ్చింది. మనం స్వతంత్రమైన నాయకులు ఉన్నారు. ఆ నాయకులకు మనం అన్ని విధాలా తోడ్పడాలి."

## 'చీకటి అధివేశం' దక్షిణాఫ్రికాకు లండన్ పత్రిక నామకరణ

లండన్, నవంబరు 28: దక్షిణ ఆఫ్రికా కాంగ్రెసు, ఒక సంపాదకీయం వ్రాస్తూ దానికి చీకటి అధివేశం అని లండన్ మితవాద పత్రిక న్యూస్ క్రానికల్ పేరు పెట్టింది.

దక్షిణ ఆఫ్రికాలో మలాన్ నేషనలిస్టుపార్టీ అధికారంలోకి వచ్చినదగ్గర నుంచి ఆ అధివేశం అధ్వాన్నమైపోయిందంటూ ఆ పత్రిక ఇలా వ్రాసింది.

నేషనలిస్టుపార్టీ అధికారంలోకివచ్చిన దగ్గరనుంచి, దక్షిణ ఆఫ్రికా రాజకీయాల్లో వెలుగు తగ్గిపోతూవచ్చింది. నానాటికి తీసికట్టు నాగంభట్టు అన్న సామెతకు అనురూపంగా ఆదేశం సాగుతున్నది. అది దేశీయులపట్ల అనుసరిస్తున్న విధానం చీకటిరాత్రులకు సహోదరంగావుంది.

అంతేకాకుండా ఈ అధివేశాన్ని గూర్చి విదేశీ పత్రికావిలేఖరులు పంపించే వార్తలను ప్రభుత్వం సెన్సార్ చేస్తున్నదన్న అనుమానం ఈమధ్య ఒకటి ఏర్పడింది. కాని దీన్ని తంతి తపాలామంత్రి కాదంటున్నారు. కాని తన ప్రభుత్వానికి వ్యతిరేకంగావున్న కొన్ని వార్తలనాపై స్వయంగా నొక్కినట్లు ఆయన స్వయంగా చెప్పుకుంటున్నారు.

దక్షిణ ఆఫ్రికా పత్రికలేవీ ఈ మంత్రి చెయిదములను హర్షించి పూరుకోవడంలేదు. ఈ మధ్యనే 'డైబర్గర్' అనే పత్రిక ఆయన్ను తీవ్రంగా విమర్శించింది. ఇది నేషనలిస్టుపార్టీని బలపరిచే పత్రికల్లో ఒకటి.

## యు. పి. లో మూడు సంస్థానాల విలీనం

### రాంపూరు, కాశీ, టెహ్రిగర్వాల్

లక్నో, నవంబరు 30: రాంపూరు, కాశీ, టెహ్రీగర్వాల్ సంస్థానములను రేపటినుండి సం॥ రా॥ ములలో కలిపివేయ భారత ప్రభుత్వమువారు నిశ్చయించిరి.

ఈ మూడు సంస్థానముల వైశాల్యము 6,276 చదరపుమైళ్లు. జనాభా 14 లక్షలు. ఆదాయము 170 లక్షల పైచిలుకు, రాంపూరు, టెహ్రీగర్వాల్ ప్రత్యేక జిల్లాలగును. కాశీ సంస్థానము కాశీ జిల్లాలో భాగముగా నుండును. ఈ మూడు సంస్థానములు కలిసిపోయిన తరువాత సం॥ రా॥ ములలో 51 జిల్లా లుండును.

జులై 1 తేదీన రాంపూరు సంస్థానమును కేంద్రప్రభుత్వ పాలనలోనికి తీసికొని చీఫ్‌కమిషనరు రాష్ట్రము చేసియుండిరి. టెహ్రీగర్వాలును ఆగష్టు 1 తేదీనను, కాశీ సంస్థానమును అక్టోబరు 15 తేదీనను సం॥ రా॥ ప్రభుత్వమువారు అనుబంధరాష్ట్రములుగా తమ పరిపాలనలోనికి తీసికొనియుండిరి.

డిసెంబరు 1 తేదీనుండి యివి రాష్ట్రములో నంతర్భాగము లైపోవును. ఈ ప్రాంతములకు రాష్ట్రీయ శాసనసభలలో ప్రాతినిధ్య ముండును. ఒక్కొక్క ప్రాంతము రాష్ట్రీయ ఎసెంబ్లీకి యిద్దరు సభ్యులను, అన్నియు కలిసి రాష్ట్రీయ కౌన్సిలుకు ఒక సభ్యుని ఎన్నుకొనును.

## రైతుల ధాన్యానికి న్యాయమైన ధర

న్యూఢిల్లీ, నవంబరు 30: రైతులుపండించే సస్యాలకు మొదలైన ఆహార ధాన్యాలకు న్యాయమైన ధర నిర్ణయించే నిమిత్తం శాసనం చేయాలనే సంకల్పం ప్రస్తుతం ప్రభుత్వానికి లేదు. ముఖ్యంగా మొదలైన వాటికనిష్ఠ ధరను కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. "కాని, ఆహార ధాన్యాల సేకరణ ధరను, రాష్ట్రసంస్థాన ప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వము సంప్రదించి నిర్ణయించినవి." అని కేంద్రప్రభుత్వ ఆహారశాఖామంత్రి, యీ పార్లమెంటులో ఒక సభ్యుని ప్రశ్నకు సమాధానమిస్తూ వెల్లడించారు.

ఈ నాయకుల స్థానంలో మళ్ళి యువక నాయకులను తయారు చేస్తుండాలి. ప్రభుత్వానికి దేశక్షేమాన్ని గురించి బాగ ఆలోచించాలి. ఎవరికి కోతులు పెట్టినంతల్ల పెద్ద పెద్ద మాటలు చెప్పినంతల్ల ప్రయోజనం ఏమీలేదు. గతించిన నాయకులను కలతపెట్టడం వల్ల లాభం ఏమీలేదు. మనం అందరము వారికి యథాశక్తిగా తోడ్పడాలి"

ఇక్కడ గోలుఖంటే కార్యక్రమంపైన నడచారు. సమావేశ విధానం గురించి శ్రీ [illegible] ఒరిస్సా ప్రధాని వారిని పుష్పమాలికలతో గౌరవించారు. మద్రాసు గవర్నరు జనరల్ ప్రత్యేక విమానంమీద వెళ్లారు.

## గడువు నిర్ణయించక పోవుటలోపమే

### కేంద్రప్రభుత్వ సూచనగూర్చి కార్యదర్శుల అభిప్రాయం

మదరాసు, డిసెంబరు 1: జనవరి 26 వ తేదిలోపున ఆంధ్రరాష్ట్ర నిర్మాణపు సన్నాహములను చేయ సాధ్యమా కాదా యని నిన్న ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అధ్యక్షతను జరిగిన కార్యదర్శుల సభయందు చర్చించినట్లు, కేంద్ర ప్రభుత్వం కోరిన అన్ని వివరాలు తేల్చుటకు ఒక ఏడాదికాదు రెండేండ్లయినా పట్టవచ్చుననియు, అయినా ప్రభుత్వంవారు ఒక తేదీ నిర్ణయించి ఆలోగా యీ విభజన వివరాలన్నీ తేల్చమంటే తేల్చుటకు వీలుండేదనియు, వారు అభిప్రాయపడినట్లు తెలియుచున్నది.

రాజధాని సమస్య, ఆస్తి అప్పుల విభజన కమ్యూనిస్టు ముప్పు మున్నగు విషయాలు కేంద్ర ప్రభుత్వంవారు లేఖలో సూచించిన అంశాలు సత్యములే అయినా, సత్వర ఆంధ్రరాష్ట్ర సిద్ధి కనుగుణ్యంగా ఆలోచించి తీసుకొనవలెనని యిచట ఆంధ్ర అధికార అనధికార వర్గాలవారు అనుకొనుచున్నారు.

పాకిస్తాను - ఇండియా, బెంగాలు, పంజాబు విభజనలు ఎంతత్వరగా జరుగలేదు. ఆంధ్రరాష్ట్రవిభజన వెంటనే చేయవచ్చునని మాడా రాజకీయవర్గాలవారు తలంచుచున్నారు.

జనవరి 25 తేదీనాటికి రాష్ట్రం ఏర్పాటు చెయ్యాలని చెప్పి రాష్ట్రంలో భాగం పూర్తిగా డిసెంబరు 6 వ తేదీన మంత్రివర్గసభలో పాల్గొనే ఆంధ్ర మంత్రులపై నాధారపడి యున్నదనియు, ఆ నాటికి ఆంధ్రనాయకులందరు సమస్యలన్నీ పరిష్కరించుకొని, కార్యవిధానం నిర్ణయించుకోవలసి యుండునని ఎంచబడుచున్నది.

ఏప్రిలు 1 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము ఏర్పాటునకు వీలున్నదని కార్యదర్శులు అభిప్రాయపడినట్లు తెలియుచున్నది.

## ఆంధ్రరాష్ట్ర విభజన కమిటీ

### కర్నాటక కాంగ్రెసు ఆక్షేపణ

హుబ్లీ, నవంబరు 30: కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శియగు డి. టి. మగాడీగారు నేడు ఈ క్రింది రీతిగా ఒక ప్రకటన చేసిరి.

మద్రాసురాష్ట్ర విభజన విషయమై తియమింపబడు కమిటీయందు ఆంధ్రసభ్యులను, తమిళ సభ్యులను మాత్రమే నియమింపబడుదురని తెలియుచున్నది ఈ వ్యవహారములో కర్నాటకులకు కూడా ప్రసక్తి ఉన్నప్పటికీ, కర్నాటకులను చేర్చుటలేదు. కనుక కన్నడిగులకు ఒక విషాదకరమైన పరిస్థితి కల్పింపబడుచున్నదని చెప్పక తప్పదు. విభజన కమిటీలో మద్రాసుశాసనసభ్యులను ఆంధ్రులును తమిళులును సమాన సంఖ్యాకులు చేరి యుండవలెనని ఇండియా గవర్నమెంటు వారు మద్రాసు ప్రభుత్వమునకు వ్రాసినట్లుగా తెలియుచున్నది. ఈ మాట నిజమైనట్లయితే కర్నాటకరాష్ట్ర కాంగ్రెసు కమిటీని సంప్రతించకుండా విడిచిపెట్టడం విషాదకరం. ఆంధ్రులచేత కరారుప్రాంతముల నన్నింటిని కలపి ఆంధ్రరాష్ట్రముగా ఏర్పాటు చేయవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీచేసిన తీర్మానమును పురస్కరించుకొని కాంగ్రెసు వర్కింగుకమిటీ చర్చ జరిపెను కాని, కర్నాటకరాష్ట్ర కాంగ్రెసు కమిటీయొక్క ఆక్షేపణలను తెలిసికొనకుండా పైపైగా నిర్ణయము చేసెను.

## "విరివిగా విరాళాలిచ్చి సహాయపడండి"

### బొంబై పౌరులకు ఎస్. కె. పాటిల్ విజ్ఞప్తి

బొంబయి, నవంబరు 30: ఆంధ్రదేశంలో తుపానువల్ల నష్టపడిన బాధితుల సహాయార్థం బొంబాయివారలు విశేషంగా విరాళాలివ్వాలని బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుడు, మేయరూ అయిన ఎస్. కె. పాటిల్ నేడు బొంబై కాంగ్రెసు సంఘ సమావేశంలో విజ్ఞప్తి చేశారు.

తుపానులో మరణించినవారి జ్ఞాపకార్థం సభవారు ఒకనిమిషం మౌనవ్రతాన్ని అవలంబించారు.

క్వెట్టా భూకంపం, బీహార్ వరదల కన్నాకూడా దారుణమైన ఈతుపాన్‌తో సమానమైన ప్రమాదం మనచరిత్రలో ఇంతవరకెన్నడూ రాలేదని పాటిల్ అన్నారు.

ఇప్పటికే బొంబాయి కాంగ్రెస్ సంఘం 101 రూపాయలను విరాళం ఇచ్చింది.

## "రెండవ పంటకు త్వరలో నీటి సప్లయి"

### గోదావరి పర్యటనానంతరం రివెన్యూ మంత్రిగారి ప్రకటన

మదరాసు, డిసెంబరు 1: "తుపానుచే దెబ్బతిన్న ప్రాంతాల నష్టం మొత్తం రూ 28 కోట్లకు మించియే యుండును. ఇంకను వివరాలు వస్తూనే యున్నవి. నేను పోయిన ప్రతిచోట ప్రజలు రెండో పంటకు నీరు అడుగుచున్నారు. అమలాపురం ప్రాంతాల ఉప్పెన కెరటం వల్ల మేటవేసిన 1½ లక్షల ఎకరాల్లో ఉప్పు పోగొట్టుటకు నీరు త్వరగా కావాలంటున్నారు. అందు 10000 ఎకరాలకు తప్ప మిగిలిన ప్రాంతాలకు వెంటనే యివ్వవచ్చని యింజనీరులన్నారు. 3 వ తేదీన మంత్రి భక్తవత్సలంగారు ధవళేశ్వరంవెళ్లగానే యీ విషయమై నిర్ణయం జరుగును". అని రివెన్యూ మంత్రి గా॥ సీతారామరెడ్డిగారు ఉభయ గోదావరి జిల్లాల సంచారం చేసివచ్చినాక పత్రికా ప్రతినిధులకు తెలిపిరి.

"అమలాపురం, నర్సాపురం, రాజోలు ప్రాంతాలో 75 చ॥ మైళ్లు ఉప్పెన కొట్టివేసింది. అక్కడ సహాయకార్యం చురుకుగ జరుగుచున్నదని ప్రజలు సంతృప్తి వెలిబుచ్చిరి. పల్లెవారి యిండ్లు పడవలు అన్ని కొట్టుకపోయినవి. లోభాగానికి పోరాదా అంటే, తమవృత్తియే చేపలు పట్టుట కనుక సముద్రం వీడలేమనిరి.

కొల్లేరు సరస్సు దీవులలో విపరీతనష్టం కలిగింది. నీరు ఇంకా తీయలేదు.

తుని ప్రాంతాల ఉల్లి మిరపకాయల పంటకు చాలానష్టం కలిగింది. రిమిషను కోరుచున్నారు. సానుభూతితో విచారించబడును.

## రూ 1 లక్ష కాపాడిన గుమస్తా

తాలూకాఫీసు, సబురిజిస్ట్రారు ఆఫీసు జలమయంకాగా ఒక గుమాస్తా ఇనుపపెట్టెలో రూ 1 లక్షనగదునోట్లు ప్రభుత్వధనం పోకుండా కాపాడెను. అతని సాహసమునకు మెచ్చి అప్పగించిన జను నుండి అక్కౌంటెంటుగ ప్రమోషను చేసిరి.

వీలేరుగండి ప్రాబల్యరగా పూడ్చబడినదని ప్రజలు చెప్పిరి. ప్రజలు బాగా అధికారులకు సహాయం చేయుచున్నారు. నిజంగా ఆర్తులకే సహాయం అందేటట్లు ఉద్యోగులకు ప్రజలు తోడ్పడవలెను. చిన్న చిన్న విన్నపాలు సహాయ కార్యములు వెంటనే మంజూరు చేయమని జిల్లా కలక్టరులకు ఉత్తర్వు చేస్తిని. పెద్ద విషయాలున్న యిక్కడికి పంపమంటిని." అని మంత్రిగారు తెలిపిరి.

## ఆంధ్ర తుపాను నిధి

### వసూళ్ల వివరములు

గవర్నరు తుపాను నిధికి మదరాసు ప్రావిన్షియలు వెల్ఫేరు ఫండు కార్యవర్గం వారు రూ 10,000 యిచ్చుటకు తీర్మానించిరి.

కృష్ణజిల్లా ఆస్పత్రిలో ఎగ్జిబిషను ద్వారా రూ 25650 యిచ్చిరి.

తూర్పుగోదావరి జిల్లా నిధి సంఘం వారు వసూలుచేసింది ఆ జిల్లాలోనే ఖర్చుచేయుట కనుమతించిరి.

తుపానునిధికి 25 వ తేదీన ప్రకటించిన రూ 89746-1-0 కాక యీ క్రింద వసూళ్లు తరువాత జరిగినవి :—

మదరాసు ప్రావిన్షియలు వెల్ఫేరు ఫండు -రూ 10,000. బెస్టు అండుకో—5000 ఢిల్లీ రెడుక్రాసుసంఘం—5000. క్రాంప్టను ఇంజనీరింగు కంపెనీ—2500. ఆర్. డి. బిర్లా (కలకత్తా)—1101 బొంబాయి గవర్నరు — 1000. బొంబాయి ఆన్వర్డు కంపెనీ—500. మెగ్రాజు కన్యాలాల (కలకత్తా)—501. ఈస్టు ఏసియాటిక కంపెనీ—500. నందలాలు మనికులాలు మజుందారు ట్రస్టు—250. ఆని మ్యూజికలు—101. ట్రిప్లికేను సేవసదలు బాలికా పాఠశాల—101. ఎన్. ఎం. ఆర్. సుబ్బరాయను—100. శ్రీ రాజగోపాలను—100. మేజరు సుందరరావు (ఢిల్లీ)—100. కోడూరు రాజగోపాలశాస్త్రి (రామేశ్వరం)—100. పేరు చెప్పనివాడు—50. రూ 50 లోపు 183-1-0.

## చిత్తూరు జిల్లాబోర్డు విరాళం

నగరి, నవంబర్ 28 : చిత్తూరు జిల్లా బోర్డు సభ్యుల సమావేశము గత శుక్రవారం ఎన్. పి. చెంగల్రాయ నాయుడుగారి అధ్యక్షతను జరిగినప్పుడు మదనపల్లికి 9 మైళ్లలో గల, భూమినిగెడ్డగ్రామంవద్ద వ్యవసాయ పాఠశాలను 3 లక్షల రూపాయల వ్యయంతో నడుపుటకు తీర్మానించారు. ఆంధ్రదేశ తుపానుబాధితుల సహాయానికి బోర్డు నిధినుండి రు. 500/- మంజూరు చేశారు. (స్వ. వి.)

### పి. ఆర్. కాలేజివారి తుపాను బాధితుల నిధి

నేటి సాయంకాలం పి. ఆర్. కాలేజి భవనములో కాకినాడ కళాసమితి శ్రీయుత రేణుకాప్రసాద్ ఆధ్వర్యమున ప్రతీకారము గుడిగుంటము అను రెండు నాటికలను పి. ఆర్. కాలేజి తుపానుబాధితుల నిధికొరకై ప్రదర్శించెను. రు 1001/- తుపానుబాధితుల నిధికి చేర్చబడెను.

## కోస్తాజిల్లాలకు కలకత్తా వైద్యదళము రాక

విజయవాడ, నవంబరు 29 : నవంబర్ 28 నాటిరాత్రి కలకత్తానుంచి, మెయిల్‌లో, ఐదుగురు డాక్టర్లు [కలకత్తా మార్వారిసంఘపు వైద్యదళము] తుపాను దెబ్బతినిన ప్రాంతములో పర్యటన చేయ వచ్చిరి. వీరికి రాష్ట్రకాంగ్రెసు తరఫున మద్దిరాల బలరామకృష్ణయ్య, డా॥ టి.వి. యస్. చలపతిరావుగారలు స్వాగతమిచ్చిరి.

కలకత్తా మార్వారి సంఘమువారు, తుపాను దెబ్బతినిన ప్రాంతములో సహాయకారులుగా నుండుటకై ఒక వైద్యదళమును పంపనున్నారని పాఠకులకువిదితమే. వైద్యదళమువారు వచ్చినవెంటనే నంటూరు వెళ్ళిరి. (స్వ. వి.)

## బందరు మునిసిపల్ కౌన్సిలరు కీ॥ శే॥ శ్రీ గుంజా వీరాస్వామి

బందరు, నవంబరు 27 : నిన్న సాయంకాలము 5-30 గంటలకు స్థానిక మునిసిపల్ కౌన్సిలువారి సభలు నిలుపబడెను. మొన్నరాత్రియే హరిజనకాంగ్రెసు కౌన్సిలరు శ్రీ గుంజా వీరాస్వామిగారు మరణమునొందుటచే నిన్న మొదటి కౌన్సిలు సభ డా॥ ఆర్. అచ్యుతరామయ్యగారి అధ్యక్షతను సమావేశమై శ్రీ వీరాస్వామి గారి మృతికి సంతాపము తెల్పుచూ వారి గౌరవార్థము నిన్నటిసభలన్ని వాయిదా వేయాలని ఏకగ్రీవముగా కౌన్సిలువారు తీర్మానించిరి. సభకాగానే కొంతమంది వెడలిపోయిరి. కాని 5½ గంటలకు ఉపాధ్యక్షుడువచ్చి, కౌన్సిలుహాలులో చైర్మన్‌గారు యుండగానే పార్టీకౌన్సిలర్లందరిని పిలిచి 5-30 గంటలకు నిర్ణయించిన సభకు అధ్యక్షతవహించవగా చైర్మన్‌గారు అచ్చటనుండి వెడలిపోయిరి. మరికొంతమంది సభ్యులుకూడా వెళ్ళిపోయిరి. 5 గంటలకు జరిగినసభలో ఆమోదింపబడిన తీర్మానమునకు వ్యతిరేకించి 5-30 గంటలకు సమావేశమైనసభ వాయిదావేయబడలేదని తీర్మానమును మరొకతీర్మానమును 70 వసభలో ఆమోదింపబడినవి. (స్వ. వి.)

# చేనేత పారిశ్రామికులలో నిరుద్యోగ నిర్మూలనకు ప్రభుత్వ సహాయం

## కృష్ణా జిల్లా సహకార సంఘాల ప్రతినిధుల సమావేశం సూచనలు

బందరు, నవంబరు 29 : కృష్ణా జిల్లా చేనేత సహకార సంఘాల ప్రతినిధుల సమావేశము మొన్న మధ్యాహ్నము జిల్లా సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకు భవనములో చేనేత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి ప్రగడ కోటయ్యగారి అధ్యక్షతను జరిగెను. మద్రాసు ప్రభుత్వం చేనేత పారిశ్రామికుల నిరుద్యోగాన్ని తొలగించుటకై ప్రవేశ పెట్టనున్న రిలీఫ్ స్కీమును చేనేత సహకార సంఘాల ద్వారా అమలు జరుపు విషయమై నిర్ణయాన్ని చేయుటకుగాను మద్రాసు ప్రభుత్వముయొక్క కోరికపై జిల్లా సహకార సంఘాల డెప్యూటీ రిజిస్ట్రారు కె. నాగరత్నం దేవరగారు యీ సమావేశమును ఏర్పాటు చేశారు. మద్రాస్ చేనేత సహకార సంఘాల స్పెషల్ డిప్యూటీ రిజిస్ట్రారు జోసఫ్ రెడ్డి, రాష్ట్ర చేనేత సహకార సంఘము యొక్క రీజినల్ మార్కెటింగు ఆఫీసరు గంజి పున్నయ్యగార్లు, చేనేత కాంగ్రెస్ నాయకులు భట్టా కుమారస్వామి, అక్కల కోటయ్య, ఇనురాతి లక్ష్మయ్య, పాలన అమ్మయ్య గారలు యీ సమావేశములో పాల్గొన్నారు.

మద్రాస్ ప్రభుత్వం ప్రవేశ పెట్టనున్న రిలీఫ్ స్కీమువలన చేనేత సహకారోద్యమమునకు, చేనేత పారిశ్రామికులకు, కలుగ గల ప్రయోజనములను గూర్చి చేనేత సహకార సంఘాల స్పెషల్ డిప్యూటీ రిజిస్ట్రారు, చెన్న రాష్ట్ర చేనేత సహకార సంఘము యొక్క రీజినల్ మార్కెటింగు ఆఫీసరు గంజి పున్నయ గారలు విపులంగా చెప్పారు. సభాధ్యక్షులు ప్రగడ కోటయ్యగారు ఉపన్యసిస్తూ చేనేత సహకార సంఘాలు రిలీఫ్‌స్కీమును అమలుపరుచుట వలన కలుగగల ప్రయోజనాలు లేకపోలేదన్నారు. దీనివలన నిరుద్యోగులైన చేనేతవారినందరను సహకారసంఘాలలో సభ్యులుగా చేర్చుకొనుటకు అవకాశమున్నది. అట్టివారందరు చెల్లించవలసి యున్న వాటా ధనమును ప్రభుత్వమే అప్పుగా యిస్తుంది. ఉత్పత్తి విక్రయములను సాగించి, సభ్యులకు పనికల్పించుటకు ఆవసరమైన పెట్టుబడిని ప్రభుత్వంస్వంత పూచీపై బ్యాంకులనుండి అప్పు యిప్పిస్తుంది. కాని రిలీఫ్ స్కీమువలన, నేయుటకు చాలినంతనూలు సరఫరాచేయ బడదు. జీవన వ్యయమునకు సరిపడిన ఆదాయమును చేకూర్చుట కవసరమైన మజూరీలు లభించవు. ఈ రెండు విషయాలలోను ప్రభుత్వ పథకములో సవరణలు అవసరం. ఈ సందర్భములో చేనేతప్రజ చేనేత సహకార సంఘాలూ తీవ్రమైన ఆందోళన జరుపవలెను. రిలీఫ్‌స్కీమువలన కలుగు కొద్దిపాటి ప్రయోజనాన్ని పొందుటకై చేనేత సహకారసంఘాలు రిలీఫ్‌స్కీమును అమలు జరుపుటకు అంగీకరించుట అవసరము అని అన్నారు. ఈ సందర్భములో కప్పల నొడ్డి, ఘంటసాల, యార్లగడ్డ, పెడన, అవనూరు, బొమ్మలూరు, చేనేత సహకార సంఘాల ప్రతినిధులు చర్చలలో పాల్గొన్నారు. తరువాత యీదిగువ తీర్మానములు చేయబడినవి. చేనేత పారిశ్రామికుల నిరుద్యోగ నివారణకై మద్రాసు ప్రభుత్వం ప్రవేశపెట్టనున్న రిలీఫ్‌స్కీమును యీ జిల్లాలో అమలు జరుపుటకు యీ సభవారు అంగీకరించుచున్నారు. ఆహార వస్తువుల ధరలు విపరీతముగా పెరిగియున్న యీరోజులలో కుటుంబానికి నెల సరి జీవన వ్యయమునకు కనీసం 75/- రూపాయిలైనా కావలసి యుంటుంది. కావున రిలీఫ్‌స్కీములో యీ దిశగా సవరణలు చేయాలని యీసభవారు ప్రభుత్వాన్ని కోరుచున్నారు.

మగ్గముయొక్క నెలసరినూలు వినియోగమును 60 లడ్డీలకు మించకుండక, నేయగలిగినంత నూలును సరఫరా చేయవలయును. లడ్డీ 1 కి 0-8-0 తగ్గని మజూరీ యివ్వవలయును.

స్థానికావసరములకు ఉపయోగపడే అన్ని రెంబన్ల నూలుతోను, బట్టలు నేయించవలెను. ఈ బట్టల యొక్క పనుపు నేత, పుంజము, రంగు, అంచు, కమ్మి, వగైరా వివరములను చేనేత సహకార సంఘాల సూచనలను అనుసరించి నిర్ణయించవలయును. బట్టలు తయారు చేయుటకు కావలసిన అచ్చులు, పన్నిలు ప్రభుత్వం చేనేతవారికి ఉచితముగా సరఫరా చేయించవలెను. చేనేత సహకార సంఘాలలో సభ్యులుగా చేరవలచినవారికి వాటా ధనమును ప్రభుత్వం ఉచిత గ్రాంటుగా యివ్వవలయును ప్రభుత్వానికి కావలసిన బట్టలు ప్రభుత్వం చేనేత సహకార సంఘాలనుంచే కొనవలెను.

తుఫాను వలన నష్టపడిన చేనేత వారికి

రాష్ట్ర చేనేత కాంగ్రెస్ కోరియున్న విధముగ ప్రభుత్వం సహాయము చేయాలని ఈ సభవారు కోరుచున్నారు. చేనేత వస్త్రములపై అమ్మకంపన్నును తొలగించవలెనని, నిబంధనలకు విరుద్ధంగా వాటాధనములను పంచుకొంటున్న చేనేత సహకార సంఘాలపై తగుచర్య తీసుకోవాలని ప్రభుత్వమును కోరుచూ కూడా తీర్మానములు చేయబడెను. చేనేత సహకార సంఘాల డి. రిజిస్ట్రారు వెంకట్రామయ్యగారి అభినందనలతో సభ ముగిసెను.

## భారత మహిళామండలి వార్షికోత్సవం

### గవర్నరుజనరల్‌కు స్వాగత మివ్వడానికి తీర్మానం

విశాఖపట్టణము, నవంబరు 29 : నిన్న సాయంత్రము భారత మహిళామండలి వార్షిక సమావేశము శ్రీమతి రమాదేవి భానోజీరావుగారి అధ్యక్షతను జరిగింది.

రమాదేవిగారిని అధ్యక్షులుగాను, ఉపాధ్యక్షులుగా శ్రీమతులు బి. రాజేశ్వరమ్మ, బి. గౌరీ కాంతమ్మగార్లనూ, సంయుక్త కార్యదర్శులుగా శ్రీ తెన్నేటి రమణమ్మ, బి. హెచ్. మీనాక్షమ్మ, కోశాధికారిణిగా చింతలపాటి సూర్య మహాలక్ష్మమ్మగార్లను సమావేశమువారు ఎన్నుకొన్నారు.

శ్రీమతి రమాదేవిగారు, సభికు కాంగ్రెసు తుపాను బాధితుల సహాయార్థము చందాలను వసూలుచేయమని కోరారు.

గవర్నరుజనరల్ రాజాజీ ఈ ఊరు వచ్చినప్పుడు వారికి స్వాగతపత్రమును ఇచ్చుటకు సమావేశమువారు తీర్మానము చేశారు. (స్వ. వి.)

## మైసూరున్యాయశాఖా మంత్రి భాష్యంగారు

### హిందూపురంలో సేవామందిర దర్శనం

హిందూపురం, నవంబరు 27 : మైసూరు న్యాయ, కార్మిక శాఖల మంత్రి కె. టి. భాష్యంగారు నేటి సాయంత్రం 5 గంటలకు కారులో ఈపుర సేవామందిరం విచ్చేశారు. మందిరాధికారులైన ఎమ్. గోవిందరెడ్డి, కె. కోనప్పగార్లు వారికి స్వాగతమిచ్చారు. మంత్రిగారు మందిరంలోని వివిధ నిర్మాణ కార్యక్రమాంశాలను శ్రద్ధగా గమనించి గాంధీజీ ఆశయముల నింత సమర్థంగా నిర్వహిస్తున్నందుకు సేవామందిరం వారిని కొనియాడారు.

తరువాత రైల్వే స్టేషను సమీపాన కే. ఎస్. రాఘవాచార్యులు (పబ్లిక్ ప్రాసిక్యూటర్) గారి అధ్యక్షత క్రింద బ్రహ్మాండమైన బహిరంగ సభజరిగింది. భాష్యంగారా సందర్భంలో గాంధీజీ విగ్రహావిష్కరణను గావించారు. గాంధిస్మారక సంఘ కార్యదర్శి హెచ్. ఎస్. చారిగారు మంత్రిగారికి స్వాగత పత్రమును సమర్పించారు. పట్టణకాంగ్రెసువారు మరొక స్వాగత పత్రమును సమర్పించారు. దీనికి సమాధానముగా హిందూపురమునకు విద్యుచ్ఛక్తి సరఫరాచేయటంలో కలిగిన అవరోధమును సాధ్యమయినంత త్వరలో పరిష్కరింప యత్నిస్తామని వాగ్దానం చేశారు.

నేటిరాత్రి స్థానిక బేసిక్ ట్రెయినింగు స్కూలులో పబ్లిక్ ప్రాసిక్యూటర్ కె. ఎస్. రాఘవాచార్యులుగారు స్థానికకాంగ్రెసువాది టి. టి. ఎల్. గుప్త గారిచే బహూకృతమైన డా॥ రాజేంద్రప్రసాద్ చిత్రపటమును ఆవిష్కరించారు. (స్వ. వి.)

## కీ॥ శే॥ పోలాప్రగడ లక్ష్మీనరసింహారావుగారు

నూజివీడు, నవంబరు 28 : సుప్రసిద్ధ ఆదిమవాసుల సేవకుడు, కాంగ్రెసుప్రముఖుడు, శ్రీ పోలాప్రగడ లక్ష్మీనరసింహారావుగారు విజయనగరము ఖాదర్‌బాబా గారి ఆశ్రమములో నిర్యాణముపొందిరని తెలుపుటకు చింతించుచున్నాను. లక్ష్మీనరసింహారావుగారు చాలకాలము నూజివీడు తాలూకా కాంగ్రెసు కార్యదర్శిగాను, ఆంధ్రరాష్ట్ర ఆదిమవాసి సేవాసంఘ కార్యవర్గ సభ్యుడుగానూ, నూజివీడు ప్రతికూలయితల సంఘకార్యదర్శిగాను పనిచేశారు.

చిత్తూరుజిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ ఎన్. పి. చెంగల్రాయ నాయుడుగారు.

## బళ్లారి కాలేజి భవన నిర్మాణం

### ప్రభుత్వంనుండి 2,17,500 రూ॥ గ్రాంటు మంజూరు

బళ్లారి, నవంబరు 28 : స్థానిక వీరశైవ కాలేజీ భవన నిర్మాణమునకుగాను ప్రభుత్వమువారు రూ. 2,17,500 సగము గ్రాంటు నిచ్చుటకు అంగీకరించినట్లు ఉత్తరువు జారీ చేయబడెను.

ఈవార్తను తెలుపుచు, కాలేజీ మేనేజిమెంటు అధ్యక్షుడు, వై. మహాబళేశ్వరప్పగారు, బళ్లారి కంటోన్‌మెంటు రైలుస్టేషన్ ఎదురుగానున్న 101 ఎకరముల స్థలము నిచ్చుటకు బళ్లారి కలెక్టరు శిఫార్సుపై రెవెన్యూబోర్డువారి ఉత్తర్వు కోసం ఎదురు చూచుచున్నామనీ, వెంటనే భవననిర్మాణమును ప్రారంభింతుమనియు, యీ సంవత్సరము ప్రారంభములో మద్రాసు విశ్వకళాపరిషత్తువారు కాలేజీకి తొలగించిన అనుబంధన పునః రావచ్చునని ఆశించుచున్నామనియు తెలిపిరి. (స్వ. వి.)

## కమ్యూనిష్టుల అరెస్టు

పొన్నూరు, నవంబరు 28 : స్థానిక పోలీసు యిన్స్పెక్టరు కె. చంద్రమౌళిగారు, సబిన్స్పెక్టరు రహూఫ్ సాహెబుగారి సహాయంతో, పరారులోనున్న తెలగాయపాలెం కమ్యూనిస్టు బెజ్జం జీవరత్నమును నిన్న పొన్నూరులో అరెస్టుగావించి అతని వద్దనున్న కత్తిని స్వాధీనపరచుకున్నారు.

ఆ సాయంత్రం, జూపూడి సబిన్స్పెక్టరు కె. మాణిక్యారావుగారి సహాయంతో, చినలింగాయపాలెంలో ఉపాధ్యాయుడుగా నున్న ఓరుగంటి శీతారామయ్య అనేక కమ్యూనిస్టును కూడా అరెస్టు చేశారు. అదేరాత్రి చల్లా నాగభూషణం అనే కమ్యూనిస్టును మన్నవలో అరెస్టు చేశారు.

నేటి తెల్లవారుజామున తను సి. ఐ. డి. పార్టీ సహాయంతో మన్నవలో అన్నవరపు కోటయ్య, గుంటుపోతురాజు, పుట్టా అంకయ్య అనే కమ్యూనిస్టులను, పాలములలో అరెస్టుగావించారు.

నేటి సాయంత్రం, జూపూడి సబిన్స్పెక్టరు కె. మాణిక్యారావు, పొన్నూరు సబిన్స్పెక్టరు రహూఫ్ షరీఫ్ గార్ల సహాయంతో, పొన్నూరులో గోళ్ళమూడి అంకయ్య అను కమ్యూనిస్టు నాయకుని అరెస్టు గావించారు. యీ అంకయ్య యిటీవలి జూపూడి కమ్యూనిస్టు దాడిలో పోలీసు కాల్పులకు గురియై, గుండుదెబ్బతిని యుండెను.

### ప్రొద్దుటూరు

ప్రొద్దుటూరు, నవంబరు 29 : స్థానిక పోలీసు ఇన్స్పెక్టరు మనోహరు, స్పెషలు బ్రాంచి సబ్‌ఇన్స్పెక్టరు సి. వి. నారాయణరెడ్డి, రిజర్వుసహాయంతో రాజుపాలెంలో సుధరెడ్డి అనే ప్రముఖ కమ్యూనిస్టు నాయకుని అరెస్టుచేసి, కమలాపురం జైలులో రిమాండులో నుంచారు. దువ్వూరు పోలీసు సబ్ ఇన్స్పెక్టరు వి. యస్. మదార్ సాహెబ్ తన సిబ్బందితో 26వ తేదీ రాత్రి ఇడమడక గ్రామంలో పెద్దపసుపుల ఏసన్న కుమారుడు మంగల నాగన్న అను కమ్యూనిస్టును అరెస్టు చేసి జమ్మలమడుగు సబ్‌జైలులో రిమాండులో నుంచారు.

### మైలవరం

మైలవరం, నవంబరు 29 : మైలవరం పోలీస్ సబ్-ఇన్‌స్పెక్టర్, నిన్నరాత్రి కోడూరు గ్రామముపై దాడిచేసి, మన్నె రత్తయ్య, మన్నె పిచ్చయ్య ఇంకొయిద్దరు కమ్యూనిస్టులను అరెస్టుచేసెను. తర్వాత దగ్గర అడవిలో, కమ్యూనిస్టులుదాచిన ఐదు మజిల్ లోడర్లనుకూడా స్వాధీనము చేసికొనెను. (స్వ. వి.)

### చెన్నపట్నం

ఎన్. ఎ. మణి, అను కమ్యూనిస్టును మదరాసు పోలీసువారు కిల్పాకు రోడ్డునందు మంగళవారం ఉదయం అరెస్టు చేసిరి. అతనివద్ద కొంతవిషము, కొన్ని నిషేధ కరపత్రములు దొరికినవి.

## ఎస్టేటు తగాదా భూములు

### తూర్పు కృష్ణా రైతు కాంగ్రెస్ కార్యదర్శి ప్రకటన

బందరు, నవంబరు 28 : తూర్పు కృష్ణా జిల్లా రైతు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి పామిరెడ్డి వెంకట సుబ్బారావురెడ్డి గారు యిట్లు వ్రాస్తున్నారు.

జమీందారీ రద్దుచట్టము ప్రకారము తూర్పు కృష్ణాజిల్లాలో దేవరకోట, కృష్ణాపురం, గూడూరు 1. ఏ. బి. భాగములు, ముంజులూరు, కృత్తివెన్ను, పెదగొల్లపాలెం, రాయవరం, బల్లిపర్రు, చిట్టుగూడూరు 1/3, సుల్తాన్‌నగరం మొదలగు జమీందారీలను ప్రభుత్వమువారు స్వాధీనము చేసుకొని యున్నారు. ఈయెస్టేట్లు ప్రభుత్వపు స్వాధీనము గాగలవని తెలిసియు, అవి స్వాధీనము చేసికోబడిన తర్వాతను, యెస్టేట్లలోని గ్రామ సాముదాయక భూములు, బంజర్లు, వృక్షములు వగయిరాలు జమీందారులు అన్యాక్రాంతము చేయుచున్నట్లు తెలియవచ్చింది.

మన ఆంధ్రరాష్ట్రములో యిటువంటి ప్రాంతములలో పర్యటనముచేసి నిజపరిస్థితులు తెలుసుకొనుటకుగాను, ఆంధ్రరాష్ట్ర రైతు.కాంగ్రెసువారు నిర్ణయించుకొనిన కార్యక్రమము ప్రకారము, డిశంబరు 9 తేదీన జిల్లాలో బందరు పట్టణమునకు రాగలరు. బందరు తాలూకా ఆఫీసునకు యెదురుగానున్న జిల్లారైతు కాంగ్రెసు కార్యాలయములో యీ విషయములగూర్చి ఆనాడు విచారింతురు గాన, యెస్టేటు గ్రామములలోని రైతులు వచ్చి యెస్టేటు తగాదా భూములనుగూర్చి రిపోర్టుల నందజేయవలసినదిగా కోరుచున్నాను.

## రాజమండ్రిలో నీటి సరఫరా అభివృద్ధి

### మెయిన్‌రోడ్డును సిమెంటు చెయ్యాలని సంకల్పం

రాజమండ్రి, నవంబరు 29 : ఈ పురపాలక సంఘసభ్యులు నిన్న డాక్టర్ ఏ. బి. నాగేశ్వరరావు (చైర్మన్) గారి అధ్యక్షతక్రింద సమావేశమై 52,500రూలు ఖర్చుతో రాజమండ్రి రైల్వేస్టేషన్‌నుండి ఆర్ట్సు కాలేజీవఱకుగల మెయిన్‌రోడ్డును సిమెంటు కాంక్రీటు రోడ్డుగా చేయుటకు తీర్మానించిరి. ప్రభుత్వమువారు 1950-51 సం॥రంలో గ్రాంటు యిచ్చెదరను తలంపుతో ఒకలక్ష అరవై వేలరూపాయలు ఖర్చుచేసి నీటి సరఫరా అభివృద్ధి స్కీమును వెంటనే అమలు పరచుటకు గూడ తీర్మానించిరి. ఈ స్కీము అమలు జరిగినచో యిపుడు సరఫరా అగుచున్న నీటికంటె దానిలో మరొక సగమునీరు సరఫరా కాగలదు. (స్వ. వి.)

## దాళవా పంటవంతు గల భూములకు ప్రధమ జలసౌకర్యం

### ప. గో. నీటిసరఫరా సంఘ తీర్మానం

నిడదవోలు, నవంబరు 28 : ఈ నెల 26 వ తేదీని నిడదవోలు రహదారీ బంగళాలో పశ్చిమ గోదావరిజిల్లా వ్యవసాయ జలసరఫరా సంఘ సమావేశము జరిగెను. జిల్లాకలెక్టరు జనాబ్ షేక్ అహమ్మదుసాహెబ్ గారు అధ్యక్షత వహించిరి. జిల్లాలోని డిప్యూటీ కలెక్టర్లు తహశీల్దార్లు, శాసన సభ్యులైన అల్లూరి సత్యనారాయణ రాజు, మాగంటి బాపినీడు, గొట్టుముక్కల వెంకన్న, శ్రీమతి అమ్మన్న రాజాగార్లును శ్రీదంతులూరి నారాయణ రాజుగారున్ను సమావేశమునకు విచ్చేసిరి.

జిల్లాలోని వివిధ ప్రాంతములనుండి వచ్చిన పెద్దవ్యవసాయదార్ల యొక్క కష్టములను వినిరి.

జిల్లాలోని నీటిసరఫరాలను గూర్చి, యెగ్జిక్యూటివ్ యింజినీరుగారి తరఫున అగ్. వి. ఎస్. శాస్త్రిగారు వివరించిరి.

అనంతరం కమిటీసభ్యులు జిల్లాలోని దాళవా పంటవంతువున్న భూములకు ప్రథమ సౌకర్యమిచ్చి అనంతరం తుపాను దెబ్బతిన్న భూములకు యిచ్చుటకు తీర్మానించినట్లు తెలియుచున్నది.

## నూజివీడులో బియ్యపు కరువు

నూజివీడు, నవంబరు 28 : నిన్న మొన్న నూజివీడులో బియ్యములేవు. ఇరవై వేల జనాభాలో నిన్న ఉపవాసము లున్నవారు పది వేలమందికైనా ఉందురు. జనులు గుంపులు గుంపులుగా బియ్యము కొరకు పేటలలో తిరుగుచున్నారు. నేడు ఒకలారీ బియ్యము బియ్యపుకొట్లవారికి చేర్చబడినవి. కాని అవి గడ్డంగను, శేరుకు పావుశేరుచొప్పున రాళ్లు, మన్ను, వడ్లుయున్నవి. నూజివీడు ఆహారపరిస్థితి ఆలించేవాడుకు లేడాయని ప్రజలు తీవ్రాందోళన చెందుచున్నారు.

### ప్రకటన

ఉపాధ్యాయులు కావలెను

కడప జిల్లాలో హారిజన వెల్‌ఫేరు డిపార్టుమెంటు పాఠశాలలో ఉపాధ్యాయులుగా పని చేయుటకు 20 మంది హైయర్ ఎలిమెంటరీ గ్రేడు ప్యాసుఅయిన వారు కావలయును. వేతనము 30-1-50 కరువు బత్యము ప్రత్యేకము.

అర్జీలలో పూర్తి చిరునామా, కులము, పుట్టిన తేది, సర్టిఫికేటు పొందిన తేది మొదలగు వివరములతో 15-12-1949 తేదినాటికి కడప హరిజన వెల్‌ఫేరు ఆఫీసరుకు చేరునట్లు పంపవలయును.

కడప. తేది 30-11-49 — కలెక్టరు.

## గంటల పంచాంగం

విరోధి నం॥ మార్గశిర శు॥ ద్వాదశి 1949 నం॥ డిసెంబరు 2 శుక్రవారం శు॥ద్వాదశి ప 2-45 అశ్వి రా 7-59 వర్జ్యం ప 3-29 ల 5-17 క.

శు॥ త్రయోదశి డిసెం॥ 3 శనివారం శు॥ త్రయోదశి సా 5-8 భర రా 10-45 వర్జ్యం ఉ 6-41 ల 8-25 క.

ఆంధ్రపత్రిక

విరోధి నం॥ మార్గశిర శు॥ ద్వాదశి శుక్రవారం

## ఢిల్లీ సమావేశ సూచనలు

"తుపానులు రానివ్వండి; భూకంపములు రానివ్వండి; మరి ఇతరఅవాంతరములు ఎన్ని అయినా రానివ్వండి, 1951 అనంతరము ఆహారధాన్యముల దిగుమతి ఉండ రాదని మే మిదివరలో చేసుకొనిన నిర్ణయము ఎంతమాత్రము మారదు" అని భారత ప్రధాన మంత్రి గత మాసము 28, 29 తేదీలందు జరిగిన వ్యవసాయశాఖ ఉద్యోగుల సమావేశమునందు చేసిన విస్పష్ట ప్రకటన రాష్ట్ర ప్రభుత్వములను, భారతప్రజానీకమును కలవరపెట్టుటకు బదులు ఆ లక్ష్యసాధనకు దీక్ష వహించి కార్యోన్ముఖులను చేయవలసియున్నది. పండిట్ నెహ్రూ ప్రకటించినట్లు ప్రస్తుతము ప్రభుత్వములు, ప్రజలు కూడ తమ తాహతుకు మించిన ఖర్చులను చేయుచుండిరి. భారత ఆర్థికవ్యవస్థ స్థిరపడవలెననిన ఈ శక్తిని మించిన ఖర్చును తగ్గించుకొనక తప్పదు.

ఆహారధాన్యముల దిగుమతి క్రింద ఏటా ప్రభుత్వము విశేషధనమును వ్యయపరచుచున్నది. ఈ ఖర్చును సాధ్యమైనంత త్వరలో పూర్తిగ తగ్గించుట యవసరమె. ఈ ఖర్చును తగ్గించుకొనుటతో పాటు, పరిశ్రమాభివృద్ధికి అవసరమైన కీలకయంత్రములను దిగుమతి చేసుకొనుటకు డాలరులను కూడ సంపాదింపవలసియున్నది. ఇందుకు వాణిజ్యపంటలను ఎక్కువగ ప్రోత్సహింపవలసియున్నది. ఒక వర్గమువారు అధికాహారోత్పత్తి కార్యక్రమము ఫలప్రదము కాకపోయినను, వాణిజ్యపంటలను అభివృద్ధి చేయుటద్వారా లభించు డాలర్లు, ఇతరవిదేశీద్రవ్యముతో భారతదేశము తన కవసరమైన ఆహారధాన్యమును దిగుమతి చేసుకొనవీలగునని సూచించిరి. భారత ప్రభుత్వ ఆహారశాఖా కమిషనర్ శ్రీ ఆర్. కె. పాటిల్‌గారు అధికాహారోత్పత్తివలన వాణిజ్య పంటల అభివృద్ధికి అంతరాయములు కలుగవని, రెండును ఏకకాలమున జరుగుట సాధ్యమని ప్రకటించి యుండెను.

ప్రస్తుత పరిస్థితులలో ఆహారధాన్యములను పండించుటకంటె వాణిజ్యపంటలను పండించుట ఎక్కువ లాభకరముగ నున్నది. గనుక రైతులు వాణిజ్యపంటలను పండించుటలో ఎక్కువ ఉత్సాహమును చూపుచుండిరి. అట్లుగాక ఆహారధాన్యములను పండించు రైతులకు కూడ వ్యవసాయము గిట్టుబాటగునట్లు చేసి, ఇతరపంటల పండించువారు లాభముపొందుచున్నట్లే వీరును లాభము పొందునట్లు ప్రభుత్వమువారు తగిన చర్యలు తీసుకొనిన దేశఆహార సమస్యలే గాక, ప్రజల జీవనప్రమాణ హెచ్చింపు సమస్యలు కూడ పరిష్కారము కాగలవు. కనుక ప్రభుత్వము అధికాహారోత్పత్తి సమస్యలను విచారించునపుడు ముఖ్యముగ ఈ విషయమును దృష్టియందుంచుకొనవలసియున్నది.

ఇతర వస్తువుల ధరలను తగ్గింపక కేంద్రప్రభుత్వము ఇటీవల ధాన్యసేకరణ ధరను తగ్గించెను. ఇందువలన అధికాహారోత్పత్తి కార్యక్రమమునకు ఎట్టి విఘాతము కలుగునో క్రమేణాగాని ప్రభుత్వ అనుభవమునకు రాదు. అందువలననె గత మాసాంతము జరిగిన వ్యవసాయశాఖాధికారుల సమావేశము సాగువిధానము, సాగుపద్ధతులను గురించియె ఎక్కువగ చర్చించెను. అధికోత్పత్తికి ప్రస్తుతము దేశమునందు హెచ్చుగ నున్న చిన్న, చిన్న కమతములు తీవ్రప్రతిబంధకములని ఢిల్లీ సభవారు భావించిరి. సహకారపద్ధతుల ద్వారాగాని, చిన్న కమతముల ఏకీకరణ ద్వారాగాని, లేక ప్రభుత్వమే సాగుచేయించుటవలనగాని ఈ ప్రతిబంధకములను తొలగింపవలసియుండునని వ్యవసాయ శాఖాధికారులు అభిప్రాయపడిరి. ప్రధానమంత్రి పండిటు నెహ్రూ భారతదేశ ఆర్థిక వ్యవస్థను గురించి అనేక పర్యాయములు చేసిన ప్రసంగములందు స్పష్టముచేసినట్లు మనభూమి అమరకము విధానమును ముందుగ సంస్కరింపవలసియున్నది. ఇందుకు కాంగ్రెసు ఒక ప్రత్యేక కమిటీనికూడ నియమించి యుండెను. ఢిల్లీ సమావేశములో వ్యవసాయ శాఖాధికారులు చేసిన సూచనలు 'కుమారప్ప కమిటీ' లోని 'అల్పసంఖ్యాకుల' అభిప్రాయములకు అనుగుణముగనున్నవి. కాబట్టి రాష్ట్రప్రభుత్వములు సహకారపద్ధతులపై సాగు చేయు విధానమును అమలు జరుపుటకు వెంటనే పూనుకొనవచ్చును. అయితే గ్రామమునకు అంతటికి ఒకే సహకారసంఘమును స్థాపించి తద్వారా ఈ కార్యక్రమమును కొనసాగించుటకంటె ఒక గరిష్ఠ ప్రమాణమును నిర్ణయించుకొని, ఆ ప్రకారము ఎంతమంది భూస్వాములు చేరిన సహకార సాగుపద్ధతి లాయకీగా నుండునో అంతమందని చేర్చి అనేకసంఘములను గ్రామసంఘమునకు అనుబంధసంస్థలుగ నెలకొల్పుట మంచిది. ఈ కార్యక్రమమును నిర్బంధము చేయుటకంటె, ప్రచారము ద్వారా, ప్రత్యక్ష నిరూపణద్వారా రైతాంగమును ఆకర్షించుట ప్రయోజనకరము.

సహకార సాగుపద్ధతినిగురించి వాదప్రతివాదముల విరమించి గ్రామములందు ఎక్కువ ప్రచారము చేయుట అవసరము. అట్లె బంజరుభూముల సాగువిషయమునను ప్రభుత్వము ఎక్కువ ప్రోత్సాహమివ్వవలసియుండును. అధమము అయిదు సంవత్సరములవరకు అట్టి భూములను సాగుచేయువారినుండి ఎట్టి పన్నులు వసూలుచేయక, సెస్సులు, శిస్తీలను మున్నగు వాటిని విధించక, మొదటి రెండు సంవత్సరములు ఎద్దులను, విత్తనములను ఉచితముగనిచ్చి సేద్యమును ప్రారంభించుటకు ఋణములను గాక, 'గ్రాంటు'ను ఇవ్వవలసియుండును. ఏ కార్యక్రమమైనను దీక్షతో, క్రమబద్ధముగ నిర్వహింపబడనిది ఫలింపకపోదు. ప్రస్తుతము అదే లోపముగనున్నది. ఆలోపమును తీర్చుటకె ప్రభుత్వము కృషిచేయవలసియుండును.

# "రాత్రివిమానటపా ఉండితీరాలి"

## పార్లమెంటులో నెహ్రూ సమర్థన

న్యూఢిల్లీ, నవంబరు 30: నేడు భారతపార్లమెంటులో, రాత్రి విమానటపా నిలుపుచేయాలంటూ రోహిణి కుమారచౌధరీ చేసిన ప్రతిపాదనపై చర్చజరిగింది. నెహ్రూ ప్రతిపాదనను ఖండించారు. విమానయాన సంస్థలను జాతీయం చేయడం అందరికీ ఇష్టమే అయినప్పటికీ ప్రస్తుతంలో అది పొసగదని ఆయన తెలిపారు. పౌరవిమానయానాలపై ఒక స్వతంత్రకమిషను ఏర్పాటుచేయాలని కే టి. షా చేసిన సూచనతో నెహ్రూ ఏకీభవిస్తూ ప్రస్తుత పరిస్థితిలో అటువంటి కమిషనుకు అవకాశం లేదనీ, సైంటిఫిక్ కో ఆర్డినేషన్ కమిటీ సూచన ప్రకారం పౌరవిమానయానసంఘం నెలకొల్పబడుతుందనీ చెప్పారు.

రఫీ అహమ్మద్ కిద్వాయి రాత్రివిమాన టపాను సమర్థించుతూ ఘాటుగా మాట్లాడారు. విమానకంపెనీల కుట్రనుకూడా ఆయన వివరించారు. అనేకమంది సభ్యులు కిద్వాయిని బలపరుస్తూ ప్రసంగించారు.

చర్చ ఇంకా ముగియలేదు.

ఇండియా ప్రభుత్వం రాత్రి విమానటపా సాగించటానికి నిర్ణయించడం గురించి సాగిన "గుసగుసలు" వట్టి అసత్యాలనీ, వాటిని ఎయిర్ ఇండియా కంపెనీవారు ఒక కరపత్రంలో ప్రచురించారనీ, రాత్రి విమానటపా సాగిన తరువాత ఒక్క ఎయిర్ ఇండియా తప్పమిగిలిన అన్ని కంపెనీలూ తమచార్జీలను తగ్గించినవనీ రఫీ అహమ్మదు కిద్వాయి (కమ్యూనికేషన్ల మంత్రి) అన్నారు.

రాత్రివిమానటపా నిలుపు చేయాలని రోహిణీ కుమార చౌధరీ చేసిన ప్రతిపాదనపై చర్చలో కిద్వాయి పై విషయాలు చెప్పారు.

కే. టి. షా మాట్లాడుతూ, రాత్రి విమానటపా ఆపివేయడంకంటె, తాత్కాలికంగా నిలుపుచేసి, అనధికార నిపుణులచేత మూడు నెలలుగా విమానయాన ఖర్చు లువగ్గరాలపై నివేదిక తయారు చేయించాలనీ, ఈలోపుగా టపా అన్ని విమాన కంపెనీలకూ పంచి ప్రభుత్వమే చార్జీలు నిర్ణయించాలనీ అన్నారు.

రోహిణీకుమార చౌధరీ ప్రభుత్వాన్ని ఈ అనుమానాలకు సమాధానా లడిగారు. అదివరలో కొన్ని ఆరోపణలకు గురిఅయి ఉన్న హిమాలయన్ ఏవియేషన్ కంపెనీకి ప్రభుత్వంపక్షపాతం చూపుతున్నదా? రాత్రివేళ విమానాలలో ప్రయాణీకులను కొనిపోయే సదుపాయాలింకా కలుగలేదా? విమాన సంస్థలను జాతీయం చేసే భావంతో ప్రభుత్వంవారు రాత్రివిమానయానాలు ఆరంభించారా? ఇది నిజమైతే పగటివేళ విమానాలు నడిపే సంస్థలను ఈ విధంగా "చంపడం" దేనికి. లైసెన్సు విధానం ఇప్పుడున్న ధోరణిలో లైసెన్సింగుబోర్డువారు మంత్రిగారి చెప్పుచేతలలో ఉండవలసి వస్తున్నది. ప్రస్తుతం విమాన కేంద్రాలలోగల ఏర్పాటులను బట్టి రాత్రివేళవిమానప్రయాణాలు సాగించడం అపాయకరం రాత్రివిమానటపా మూలంగా 7½ లక్షల గాలనుల పెట్రోలు వ్యర్థమవుతున్నది. ఇంతకన్న ఈ ఖర్చుతో ప. బెంగాలు వంటి రాష్ట్రాలలో రోడ్డు రవాణా సౌకర్యాలు పెంచవచ్చు. పెట్రోలు దుర్వ్యయంవల్ల అధి కాహారోత్పత్తి, కాందిశీకుల పునరావాస కార్యక్రమమూ దెబ్బతినగలవు. జమ్మూ కాశ్మీరుయుద్ధంలో ఎంతో దేశభక్తి ప్రకటించిన విమానకంపెనీలను లోనివేసి ఒకటి రెండు కంపెనీలకు పక్షపాతం చూపడం భావ్యంకాదు.

సభ్యుల కోరికపై రఫీ అహమ్మదు కిద్వాయి చర్చకు అడ్డంవచ్చి ఈ విధంగా అన్నారు: "పది నెలలుగా గుసగుసల ప్రచారం సాగుతూ, నాశాఖను గురించీ పౌర విమానయాన డైరెక్టరేటునుగురించీ అనేక ఆరోపణలు చేయబడినవి. ఈ గుసగుసలన్నీ అవ్యక్తవకాస్తూ ఎయిరిండియా వారు కరపత్రంగా ప్రచురించారు. బొంబాయి ఢిల్లీలమధ్య రాత్రి విమానాలు నడపమని కోరుతూ జనవరి 18 న ప్రభుత్వం కొన్ని కంపెనీలను ఆహ్వానించి అకస్మాత్తుగా 15, 16 తేదీలలో, కలకత్తా బొంబాయి మద్రాసు ఢిల్లీలమధ్య రాత్రివిమాన టపా రవాణా చెయ్యడానికి ఇండియన్ ఓవర్‌సీస్ వారిని ఏర్పాటుచేశారనీ ఆరోపించబడింది. రాత్రి విమానటపా ఏర్పాటు చేయాలని నేను మొదట సంకల్పించినప్పుడు అదనంగా విమానాలున్న కంపెనీలు రెండే ఉన్నవనీ, అందులో ఎయిర్ సర్వీసెస్ ఆఫ్ ఇండియా కంపెనీ తక్కువ ఖర్చుతో నిపుణంగా నడుస్తున్నదనీ తెలిసింది. 1948 జూలైలో నేను ఆ కంపెనీ ప్రతినిధిని పిలిచిమాట్లాడాను. కాని ఆ కంపెనీవారు హెచ్చుచార్జీ అడగడంవల్ల ఆ విషయం వదులుకోవలసి వచ్చింది, అప్పుడు రెండవ కంపెనీ అయిన ఇండియన్ ఓవర్‌సీస్‌ను పిలిపించాను. వారు మైలుకు నాలుగురూపాయలడిగారు. మేము పగటివిమానటపాకిచ్చినట్లే ఇస్తామనీ, ప్రయాణీకులను కొనిపోయేటందుకు లైసెన్సు ఇప్పించగలమనీ చెప్పాము. 1948 నవంబరులో మాసూచనలకు అమోదిస్తూ ఆ కంపెనీవారు వ్రాశారు. అయితే రాత్రివేళ ఈ కంపెనీవారు ప్రయాణీకులను కొనిపోవడానికి పౌర విమానయానాల డైరెక్టరు జనరలు ఆమోదించలేదు. తరువాత ఇతర కంపెనీలకు ఆహ్వానం పంపబడింది. బొంబాయి ఢిల్లీల మధ్య విమానాలు నడిపే రెండు కంపెనీల వారినీ రాత్రివేళ విమానాలు నడుపుతారా అని అడిగాము. వారు సమాధానాలిచ్చేలోగా ఇండియన్ ఓవర్‌సీస్‌వారు రాత్రి విమానాలు నడుపుతామనీ ప్రయాణీకులను తీసుకుపోయే పరిస్థితు లేర్పడేవరకూ సామానులు చేరవేసుకొంటామనీ అన్నారు. ఇది 1949 జనవరిలో జరిగింది. అప్పుడు పై రెండు కంపెనీలకూ చేసిన సూచన ఉపసంహరించబడింది. ఫిబ్రవరి 1 నుంచి విమానటపానడవవలసి ఉండడంచేత 1949 జనవరి 25న లైసెన్సింగుబోర్డు సమావేశం జరిగింది. అందులో అన్ని విమాన కంపెనీల ప్రతినిధులు ఉన్నారు. తామే రాత్రి విమానాలు నడపడం గురించి ఆలోచించడానికి తమకు నెల రోజుల వ్యవధి కావాలని వారడిగారు. అందుచేత ఇండియన్ ఓవర్సీస్ వారికి నెలరోజులపాటే లైసెన్సు ఇవ్వబడింది. అయితే నెలగడువు తరువాత ఈ కంపెనీలవారు తమకు నష్టంవస్తుందనీ, తాము రాత్రి విమానాలు నడపమనీ చెప్పారు.

"ఇందులో ఇండియన్ ఓవర్సీస్‌కు చూపిన పక్షపాతమేమున్నది? నేను ఓవర్సీస్ కంపెనీకి ఏప్రిలు 1 నుంచీ లాభాలు చూపుతానని రహస్యంగా చెప్పడంవల్ల ఆ కంపెనీ రెండునెలలపాటు నష్టపడడానికి ఒప్పుకున్నదని ఎయిరిండియా కరపత్రం ఆరోపిస్తున్నది. కాని యథార్థవిషయాలు ఎయిరిండియాకు తెలుసునని నేను రుజువు చేయగలను. ఆ కంపెనీకి చెందిన గుహనాథ్ బెహ్రాన్ నాకు ఈ పత్రం వ్రాసిఉన్నారు".

విమాన రవాణా లైసెన్సింగుబోర్డు సభ్యులను తాను మార్చిన మాట నిజమేననీ, ఆ బోర్డు స్వతంత్రాపన అయిన విధానాన్ని బట్టి కొత్త విధానాలు అమలు చేయడం దుర్లభంగా ఉండిందనీ, హైదరాబాదు సమస్య తీవ్రంగా ఉన్న తరుణంలో కే. ఎమ్. మున్షీ అతిముఖ్యమైన కాగితాలతో బయలుదేరి రావడానికి విమానాలలో సీటుదొరక లేదనీ, అందుచేత ప్రభుత్వంవారు ఓవర్సీస్ కంపెనీ వారిని హైదరాబాదు మీదుగా విమానాలు నడపమని కోరారనీ, దానికి వారు ఢిల్లీకికూడా విమానాలు నడపనిమ్మని కోరారనీ, అయితే ఈ కంపెనీకి లైసెన్సు ఇవ్వడానికి బోర్డు నిరాకరించిందని, ప్రభుత్వం వారే లైసెన్సు ఇవ్వడానికి తనపెట్టిన మీదట బోర్డు వారు తాత్కాలిక లైసెన్సు ఇచ్చారనీ, ఇటువంటి సందర్భాలింకా అనేకం ఉన్నవనీ, మద్రాసు ప్రభుత్వం వారు మద్రాసు నుంచి నేరుగా ఢిల్లీకి విమానాలు నడపడానికి ప్రయత్నించి విఫలులైనారనీ కిద్వాయి అన్నారు.

ఆయన మరొక ఉదాహరణ కూడా చెప్పారు. "భారత్ ఎయిర్వేస్ వారికి 3 స్కైమాస్టరు విమానాలున్నవి. వాటిలో 60 మంది ప్రయాణీకులు పోవచ్చు. వాటిని చౌకగానే గాక, రాత్రివేళ గాని పగటివేళ గాని క్షేమంగానే నడపవచ్చును. కలకత్తా బొంబాయిల మధ్య రాత్రివేళ టపానూ, ప్రయాణీకులనూ, నేను కోరిన దానికన్న చౌకగా నడుపుతామని వారన్నారు, నాకు సమ్మతమయింది. కాని తాతాకు ఈ విషయం తెలియగానే నా దగ్గిరకి కలకత్తాకు పరుగెత్తుకొని వచ్చి, కలకత్తా బొంబాయిల మధ్య ఈ పెద్ద విమానాలు నడిస్తే ఎయిరిండియా విమానాలు నిలిపి వేయవలసి వస్తుందన్నారు. ఆయన అభ్యంతరాన్ని ఆమోదించాను. కొత్త కంపెనీలు మంచి విమానాలను, భద్రతగల వాటిని, చౌకగా నడిచే వాటిని వాడుకలోకి తీసుకు రావడానికి వీలులేకపోతే అభివృద్ధి ఎట్లా సాధ్యమవుతుంది? భారత్ వారికి కలకత్తా కరాచీల మధ్య విమానాలు నడపడానికి లైసెన్సు పొందమని సలహా ఇచ్చాను. కాని ఆ దారిలో విమానాలు నడుపుతున్న సేవనక్ ఎయిర్వేస్ వారు అభ్యంతరం చెప్పారు. లైసెన్సింగు బోర్డు సభ్యులను మార్చడానికి కారణం ఇదే."

రాత్రి విమానాల వల్ల పగటి విమానాలు నడిపే కంపెనీలకు నష్టం జరగడం లేదని కిద్వాయి నిరూపించారు. విమాన ప్రయాణాలు చేసేవారి సంఖ్య ఈ యేడు కించపేటుకు తగ్గలేదు. కాగా సర్వత్రా విమానటపా ఏర్పాటయినప్పటి నుంచీ సగంటపా రాత్రి విమానాలకే దక్కింది. ఈ యేడు ప్రభుత్వం అమలు చేసిన రాత్రి విమానయానాలను గురించీ, పెట్రోలు పన్ను ముదరా గురించీ చులకన చేసి మాట్లాడుకున్నారు. ప్రభుత్వ అంచనాల ప్రకారం పెట్రోలు పన్ను ముదరా వల్ల విమాన కంపెనీలకు 40 లక్షలు లాభం ఉంటుంది. ఒక్క ఎయిరిండియాకే 10 లక్షలు లాభం. ఆరునెల్ల కాలంలోనే వారికి ₹.87,000 లాభించింది. అయినా తమ కేమీ లాభించ లేదని వారంటున్నారు.

రాత్రి విమానాలవల్ల పగటి విమానాలు నడిపేవారికి నష్టం రావడంకూడా నిజం కాదు. గత సంవత్సరం ఎయిర్వేస్ ఇండియావారికి విమానయానాలమీద మైలుకు 3 న్నర రూపాయల రాబడి వచ్చింది. 3 లక్షల 87 వేలు లాభం వచ్చింది. ఈ కంపెనీ మూలధనం 21 లక్షలు మాత్రమే. దక్కన్ ఎయిర్‌వేస్ కిందటేడు 8 నెలలే పనిచేసినప్పటికీ, వారి రాబడి కూడా మైలుకు సుమారు 3 న్నర రూపాయలే అయినప్పటికీ, ఏడాది ఖర్చులూ పోను కొద్దిలాభం మిగిలింది. కాని ఎయిరిండియా ఖర్చు మైలుకు రు. 5-3-0 ఉంటుందంటున్నారు. ఇదినమ్మ శక్యంకాదు. ఎయిరిండియావారు ప్రభుత్వానికి విమానాలు సరఫరా చేసినప్పుడు మైలుకు ఐదు రూపాయలు చార్జి చేసి, ఇతరులకు మూడు రూపాయిలూ, మూడురూపాయల పావలా మాత్రమే చార్జి చేశారని కిద్వాయి చెప్పగా సభ్యులు "సిగ్గు, సిగ్గు" అని కేకలు వేశారు.

ఎయిరిండియా సంస్థ చరిత్రనుగురించి కిద్వాయి ఈ విధంగా చెప్పారు: ఈసంస్థను తాతా కంపెనీవారు 1932, 33 లలో స్వయంగా ఆరంభించారు. అప్పట్లో వారికి 20 వేల రూపాయల ఖరీదు చేసే 3 డకోటావిమానా లుండేవి. వారి మూలధనం 2 లక్షలుండవచ్చు. హెనుకు 5 రూపాయల చొప్పున వారు టపాకింద అందుచేని సొమ్ము వసూలు చేశారు. 1944 లో వీరు తమ సంస్థను లిమిటెడు కంపెనీ చేయగోరి తమ లెక్కలు చూపుతూ తమ పెట్టుబడి 10 లక్షలకు పైగా ఉన్నట్లు తెలిపారు. 1944-45 లలో ఈ కంపెనీకి 12 లక్షలు లాభం వచ్చింది. 1946 లో ఇది ఎయిరిండియా లిమిటెడుగా మారింది. అప్పటికి వారు పెట్టుబడికింద 13 లక్షలూ, పరపతికింద 20 లక్షలూ మూపారు. ఈ కంపెనీకి 15 డకోటాలూ, 6 స్కైకింగ్ విమానాలూ ఉన్నవి. వీటి ఖరీదు 62 లక్షలు మించదు. గత మూడు సంవత్సరాలకాల లోనూ వీరు 66 లక్షలు తరుగుదల కింద ఖర్చు చూపారు!

హిమాలయన్ ఎయిర్వేస్‌కు ప్రభుత్వం చూపిన "పక్షపాతం" కూడా కిద్వాయి వివరించారు. రాత్రి విమానాలకు ప్రయాణీకులు రారనీ, అందుచేత పగటి విమానాలకంటె హెచ్చు చార్జీ లివ్వాలనీ అనేక విమానాల కంపెనీలవారు తెలిపారు. వర్షాల మూలంగా రాత్రి విమాన టపా నిలుపు చేయబడుతూ ఉండడంవల్ల ఆలోచించడానికి ఎయిరిండియా వారికి ప్రభుత్వం మూడు నెలల వ్యవధి ఇచ్చింది. ఈ లోగా ఎయిరిండియాతో మరికొన్ని కంపెనీలు చేరి కట్టుకట్టినవి. వారంతా కలిసి రాత్రి విమానాలు నడపడానికి సిద్ధపడ్డారు గాని చార్జీల దగ్గిర పేచీ వచ్చింది. ప్రభుత్వం వారి చార్జీలకు ఒప్పుకొన్న భారత్ కంపెనీని పై ఆరు కంపెనీలవారు తమలో కలవనివ్వలేదు.

రాత్రి విమానాలు నడిపే కంపెనీలు ప్రభుత్వం కోరినట్లు చేయడానికి సిద్ధంగా ఉన్నవి. తమకు లైసెన్సు లభించే ఎడల ఒక కంపెనీ వారు ఉత్తమ తరగతి విమానాలను ఫ్రాన్సు నుండి తెప్పించడానికి సిద్ధంగా ఉన్నారు. రెండు విమానాల కంపెనీలపై రహస్య రవాణాలు చేసినట్లు ఆరోపణ రాగా ఆ కంపెనీలను సస్పెండు చేయడమయింది. కాని ఆరోపణలు రుజువు కాలేదు. రాత్రివిమానాలను ఒక నెలపాటు మాని ఎయిరిండియావారు తప్ప మిగిలిన కంపెనీలన్నీ చార్జీలు తగ్గించినవి.

కిద్వాయి మాట్లాడడం ముగించగానే సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

కె. టి. షా ఒకసవరణ ప్రతిపాదిస్తూ, పౌరవిమానయాన సమస్య పరిశీలించబడాలనీ, దీనికిగాను అవసరమైతే విదేశీయులనుకూడా పిలిపించి స్వతంత్రమైన కమిషను ఏర్పాటుచేయాలనీ, పౌర విమానయానాలూ, విమానరవాణాలూ ప్రభుత్వంవారికింద ఉండడం దేశ క్షేమానికి కూడా అవసరమనీ అన్నారు.

## పండిట్ నెహ్రూ ప్రసంగం

ప్రధాని పండిట్ నెహ్రూ మాట్లాడుతూ షా చెప్పినది చాలావరకు తనకు ఆమోదకరమేననీ, అయితే ఆయన ప్రతిపాదన ప్రధాన సూత్రాలనుకాక పైపై ఆరోపణలను పురస్కరించుకొన్నదనీ, రాత్రి విమానటపా విజయవంతంగా ఉన్నది కనుక దానిని నిలుపుచేసే సూచనలను ప్రభుత్వం ఆమోదించదనీ, విమానటపా నడపడంలో ఏమైనా లోపాలున్నప్పటికీ షా సూచించిన విచారణ వంటిది దీర్ఘకాల పథకాలను పురస్కరించుకొని జరగాలనీ అన్నారు.

విమానరవాణాలు క్లిష్టమైన విషయాలు. వాటికి చాలా పునాదికావాలి. అనేకమంది నిపుణులకూ, వైమానికులకూ శిక్షణ ఇవ్వాలి. పెద్దఎత్తున వ్యవస్థాపన జరగాలి. పెట్టుబడి కొంచమేనని ఎవరుపడితే వారు అరడజను డకోటాలు కొని వైమానికులను నియోగించి వాటిని నడిపించవచ్చు. విమానరవాణాల కా పునాది చాలదు. గట్టి పునాదిపై వ్యవస్థాపించిన కంపెనీలుండాలి. మామూలు పరిశ్రమలలోకంటె భద్రత కొరకు ఈ వ్యాపారంలో ఎక్కువ ఖర్చు చేయవలసి ఉంటుంది. ఇది ప్రభుత్వంవల్ల గాని ఇతర అధికార సంస్థలవల్ల గాని సాధ్యమవుతుంది. స్వతంత్రుల సలహా కూడా ఉండాలి. విమానకంపెనీల సలహా చాలదు.

"ఏదో తగాయిదా ఉన్నట్టూ అందులో ప్రభుత్వం ఒకపక్షమై ఉన్నట్టూ కనిపించడం శోచనీయం. అటువంటిదేమీ లేదు. ప్రభుత్వం గాని రవాణా శాఖ గాని పొరపాటు చేసినట్టయితే దానిని పార్టీ రాజకీయాల ప్రమేయం లేకుండా విచారించాలి. ఇందులో కూడా అభిప్రాయ భేదాలుంటవి. ప్రతి అభిప్రాయాన్నీ, ఆరోపణనూ విచారించే పని ప్రభుత్వానిది, షా చెప్పిన సూచన ప్రకారం స్వతంత్రుల సలహా పుచ్చుకొనడం తరవాత జరగవచ్చును. ఈ సందర్భంలో కాదు. ఇప్పుడు విచారణ జరిగితే రాత్రి విమానటపా కష్టసుఖాలు ఆరోపణలూ మాత్రమే విచారించబడి ముఖ్య విషయాలు పరకకు పోగలవు" అని నెహ్రూ అన్నారు.

పౌర విమానయానాలను జాతీయంచేయడం గురించి మాట్లాడుతూ నెహ్రూ, ఇది అందరికీ సమ్మతమైన విషయమే గాని ప్రస్తుతం పొసగదనీ, రెండు సంవత్సరాల కిందట ఈ సందర్భమై ఏర్పడిన కమిటీ వారు చేసిన తాత్కాలిక నివేదికపై ప్రభుత్వం ఇంకా ఎట్టి నిర్ణయమూ చేయలేదనీ, ఎయిరిండియా ఇంటర్నేషనల్ సంస్థలో ప్రభుత్వానికి ప్రయివేటు కంపెనీకీ కూడా పెట్టుబడిలో భాగం ఉండాలని నిర్ధారణ అయిందనీ, అంత పెద్ద సంస్థను నిర్వహించడం ప్రభుత్వానికి సాధ్యంకాలేదనీ, ఈ సంస్థ పెద్దవ్యవస్థాపనతో కూడుకొని సమర్థతతో ఇతర అంతర్జాతీయ విమాన సంస్థలతో పోటీ చేస్తున్నదనీ అన్నారు. ఎయిరిండియా ఇంటర్నేషనల్ విమానాలలో తాను అరడజనుసార్లు ప్రయాణాలు చేశాననీ, యిది విజయవంతమైనందుకు ఇతర దేశాలలోని విమాన సంస్థలవారు అచ్చెరువు పొందారనీ, ఈ విమానంలో ప్రయాణించే వారికి సమస్త సౌకర్యాలూ ఉన్నవనీ, ఎంతో దక్షతతో నిర్వహించబట్టే యిది సాధ్యమయిందనీ నెహ్రూ అన్నారు. ఈ సంస్థను గురించి ఇండియా గర్వపడవలసి ఉన్నది. ఇది ఇండియాయొక్క సమర్థతకు నిదర్శనంగా వున్నది. ఈ సంస్థ ఇంకా పొదుపుగా నడపవచ్చునా అన్నది నిపుణులు చెప్పవలసినమాట.

ఈ కంపెనీకి అంత పెద్దనష్టం ఎందుకు వచ్చినదీ విచారించాలి. కొత్తలో ఇటువంటి సంస్థలకు ఖర్చు జాస్తిగా ఉంటుంది. యిది పోనుపోను తగ్గుతుంది. అదీ కాక విమాన సౌకర్యాలు హెచ్చించుకొనే సందర్భంలో ప్రతి ప్రభుత్వమూ ధనసహాయం చేస్తుంది. దేశ క్షేమానికది అత్యవసరం.

"ఈ దేశంలో ప్రభుత్వం తప్ప మరొకరు గుత్తవిధానం అవలంబించడం స్వయంగా నా కిష్టంలేదు. మంచి సంస్థలకు ప్రభుత్వం ప్రోత్సాహం ఇవ్వవచ్చు గాని అధిక సంఖ్యగల సంస్థలకు ప్రోత్సాహం ఇవ్వడంవల్ల అనవసరంగా పోటీ పెరుగుతుంది," అని నెహ్రూ అన్నారు.

సైంటిఫిక్ కోఆర్డినేషన్ కమిటీవారు విమానశాఖ నిమిత్తం నిపుణులసంఘం నియమించాలని సూచించి ఉన్నారనీ, అందులో హిందూస్థాన్ ఎయిర్‌క్రాఫ్ట్, ఎయిరోనాటికల్ సొసైటీ, రాయల్ భారత విమానశాఖ, రవాణాశాఖల ప్రతినిధు లుంటారనీ, ఇతరుల సలహాలుకూడా అవసరమైతే పుచ్చుకొంటారనీ, వారి సిఫార్సులు అమలు చేయబడతవనీ, ప్రభుత్వంవారు అందరి సలహాలను తీసుకొన్న మీదటనే తమ విధానాలను నిర్ణయిస్తారనీ నెహ్రూ అనగా సభ్యులు హర్షం వెలిబుచ్చారు.

ఎం. ఆర్. మసానీ మాట్లాడుతూ, రాత్రివిమాన రవాణాలు నిలుప నవసరం లేదు గాని, అవి నిర్దుష్టంగా జరిగేటట్టూ, విమాన కంపెనీలు చూపే లోపాలు లేకుండా ఉండేటట్టూ చూడాలనీ, దీనికి పౌర విమాన యానంతో సంబంధం ఉన్నదనీ, గత సంవత్సరకాలంలో రెండు విమాన కంపెనీలు దివాలా తీసి మరి ఒకటి నిలిచిపోయిందనీ, మరి ఒకటి రెండు కంపెనీలకు కూడా అగతే పట్టవచ్చుననీ, ఎనిమిది విమాన కంపెనీలుంటే ఒక కంపెనీ మాత్రమే లాభాలు తీసిందనీ, అది కూడా ఈ ఏడు 25 లక్షలు నష్టపడవచ్చుననీ, దీని విషయమై ప్రభుత్వం ఆలోచించి తీరాలనీ, ప్రభుత్వం పెట్రోలుపన్ను ముదరా కింద 9 అణాలిస్తే ఆవార 10 అణాలకు పైగా ఖర్చులు పెరిగినవనీ, అమెరికాలోనే రవాణా చార్జీలు మనిషి 1కి మైలుకు నాలుగున్నర అణాలుంటే, ఇండియాలో 4 అణాలే ఉన్నదనీ, ఈ విషయాలను గురించి శాస్త్రీయమైన విచారణ జరగడం అవసరమేననీ అన్నారు.

40 లక్షలు పెట్రోలుపన్ను ముదరాకిందా, మరి కొంత సొమ్ము తపాలా రవాణాల కిందా ఇచ్చినా విమానయాన పరిశ్రమ బాగుపడకపోతే ప్రజల సొమ్ము దుర్వినియోగ మవుతున్నదనీ, యీ పరిశ్రమను జాతీయం చేయకపోవడం ప్రభుత్వ తప్పనీ మోహన్‌లాల్ గౌతమ్ అన్నారు.

ఆర్. కే. సిధ్వా మాట్లాడుతూ, రాత్రి విమాన టపా విజయవంతంగా ఉన్నదనీ, దానికొరకు తపాలా చార్జీలు పెంచబడినవనీ, విమానకంపెనీలు పోటీచేయడం ప్రజలకు లాభమనీ, జె. ఆర్. డి. తాతా దేశభక్తి పరాయణుడేగాని అటువంటి కరపత్రం ప్రచురించి ఉండరాదనీ అన్నారు.

తిరుమలరావు మాట్లాడుతూ ప్రభుత్వం తొందరపడి రాత్రి విమానయానం తలపెట్టి, దేశరక్షణకు అండగా వున్న కంపెనీలతో తగాదా పెట్టుకొన్నదనీ, ప్రాణంతో కూడుకున్న విషయంలో డబ్బుకోసరం చూడడం మంచిదికాదనీ అన్నారు. రాత్రిపూట విమానాలు క్షేమంగా దిగడానికి వసతులున్నవని రవాణాల ఉపమంత్రి తిరుమలరావుగారికి సమాధానం చెప్పారు.

రాత్రి విమానటపా ఏర్పాటు చేసి విమానయానవ్యయం తగ్గించినందుకు కుల్‌సర్ బావీహా కిద్వాయిని ప్రశంసించారు.

అజిత్ ప్రసాద్ జైన్ మాట్లాడుతూ, విమాన సంస్థలకు ప్రభుత్వం ప్రజల డబ్బుతో సహాయం చేస్తున్నది కనుక ఈ సంస్థలు దుర్వ్యయం చేయకుండా విచారణ జరపడం అవసరమని, విమాన సంస్థల మధ్య పోటీలు ఈ సభలో చర్చకు రావడం శోచనీయమనీ అన్నారు.

శ్రీమతి రేణుకా రాయ్ మాట్లాడుతూ ప్రభుత్వం విమానయానాలను ఎందుకు జాతీయం చేయలేదో తెలియదనీ విమాన కంపెనీలు ప్రభుత్వాన్ని "బెదరడం" సహించరాదనీ, ప్రభుత్వ యాజమాన్యం కింద విమానయానం అభివృద్ధి పొందకపోయినా, లోపాలు సవరించడం ఇతరుల చేతిలోకాక ప్రభుత్వం చేతిలో ఉంటుం

(6 వ పేజీ చూడుడు)

## మద్యనిషేధ ప్రచార అధికార్ల నియామకం

### నిర్ణాయక సంఘ అధ్యక్షుడు డా॥ రంగయ్యగారి ప్రకటన

ఏలూరు, నవంబరు 30: మద్యనిషేధ ప్రచారం చేయడానికి అధికారులను నిర్ణయించే నిమిత్తం ఏర్పాటుచేసిన ఆంధ్ర ప్రాంత సంఘ అధ్యక్షుడు డా॥ ఎమ్. రంగయ్యగారు, తమ నిర్ణాయక సంఘం డిసెంబరు 8 వ తేదీ ఉదయం 11 గంటలకు మద్రాసులో చేపాక్, రివిన్యూ బోర్డు ఆఫీసులో సమావేశమై, చిత్తూరు, నెల్లూరు జిల్లాల నుండి వచ్చే అభ్యర్థులకు ఇంటర్వ్యూ ఇస్తుందని తెలియజేస్తున్నారు.

## కర్నూలునుండి సెనేట్‌కు కాంగ్రెసు అభ్యర్థులు

విజయవాడ, నవంబరు 29:— శ్రీ కర్నూలు జిల్లా స్థానిక సంస్థలకు ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ లోగల సభ్యత్వ స్థానమునకు కాంగ్రెసు అభ్యర్థులుగా కర్నూలు కౌన్సిలర్ పి. టి. రాజుగారిని, జిల్లాబోర్డు సభ్యుడు ఆర్. కే. రామలింగారెడ్డి [చాగలమర్రి] గారిని నియమించవలసినట్లు రాష్ట్ర కాంగ్రెసు కార్యాలయంవారు తెలుపుచున్నారు.

## భా. జా. ట్రే. యూ. కాంగ్రెస్ ఆంధ్రశాఖ కార్యాలయం మార్పు

విశాఖపట్నం, నవంబరు 30:— భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఆంధ్రశాఖవారి కార్యాలయం ప్రస్తుతం ఉత్తర విశాఖలోని చికాకోలులో వున్నది. దీనిని రేపటి నుండి విశాఖపట్నానికి మారుస్తున్నామనీ, ఇతర ప్రత్యుత్తరాలు జరిపేవారు విశాఖపట్టణ ప్రాయాలనీ కార్యాలయం అధ్యక్షులు చున్నారు.

## బండిమనిషి దుర్మరణం

### విజయవాడలో లారీడ్రైవర్ తీవ్ర వేగ ఫలితం

విజయవాడ, నవంబరు 30: కొల్లిపూడి వైపునుండి తీవ్రవేగంతో వస్తున్న ఒక లారి నేడు విజయవాడ మునిసిపల్ పరిధులలోపల ఒక రెండెడ్లబండికి ఢీకొనటంచేత, బండిమనిషి తక్షణమే మరణించాడు. లారీ నిండా సరుకులున్నవి. బండి ముక్కలైనది. కాని ఎడ్లు సురక్షితంగా తప్పించుకొన్నవి. సర్కిల్ ఇన్స్పెక్టరు కె. ఎస్. రామారావుగారు ఈవార్తవిన్న వెంటనే ఆస్థలమునకు వెళ్ళారు. దర్యాప్తు సాగుతున్నది. స్వ. వి.

## గుంటూరు పురపాలక సంఘ సమావేశం

### అగ్రహారంలోని స్థలంకోసం చర్యతీసుకొన నిర్ణయం

గుంటూరు, నవంబరు 29: ఈ ఊరి అగ్రహారంలో కోనేరుకు మర్యాదరిగుడి మధ్యనున్న సుబేదారి బావి, దానిచుట్టూగల ఖాళీస్థలంమీద పురపాలక సంఘం తన హక్కులను స్థిరపరచుకోవాలని, ఇందుకు అవసరమైతే సివిల్ కోర్టులో దావా వేయాలనీ, నిన్న సాయంత్రం గుంటూరు పురపాలక సంఘసమావేశంలో కాంగ్రెసు పార్టీ సభ్యుడు డా॥ ఎస్. మల్లిఖార్జునరావుగారొక తీర్మానాన్ని ప్రతిపాదించారు.

తీర్మానానికి అభ్యుదయపార్టీ సభ్యుడు జి. దేవదానంగారు సవరణ ప్రతిపాదిస్తూ, ఆ స్థలం విషయమై న్యాయవాదుల సలహాలు పరస్పర విరుద్ధంగా వున్నాయి కనుక, వెంటనే కోర్టుకుపోయి నష్టపడటం కంటే, ముందుగా అడ్వకేటు జనరల్ సలహా తీసుకోవాలనీ, ఆ సలహా 6-12-49 లోగా అందకపోతే అప్పుడే కోర్టులో దావా వేసి వ్యవహారం జరపవచ్చునీ, అందువల్ల మునిసిపల్ న్యాయవాదిని, కమీషనర్ గారిని సంఘపు ఖర్చులమీద వెంటనే మద్రాసు పంపి అడ్వకేటు జనరల్ సలహా తీసుకోవాలనీ అన్నారు. తీర్మాన ప్రతిపాదకుడు ఈ సవరణ అంగీకరించినందున సవరణతో సహా తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదం పొందింది. (స్వ. వి.)

## ఇండోనీషియాకు అధికార దత్తత

### బటేవియాకు డచ్చిఉప ప్రధాని ఆగమనము

బటేవియా, నవంబరు 29: ఇండోనీషియాకు అధికారం దత్తతచేయు సందర్భమున జరుగవలసిన ఏర్పాట్లను త్వరితముగా పూర్తిచేయుటకు వచ్చిన విదేశాంగ మంత్రి డా॥ స్టిక్కర్, ఉపప్రధాని డా॥ వాన్‌సుసెయిను నేడు యిచ్చటికి వచ్చిరి.

యూరపు ఖండం అంతటిలోనూ బ్రహ్మాండమైనదని చెప్పుకోదగిన (నూనెను పరిశుభ్రంచేసే) యంత్రాగారాన్ని సౌతాంప్టన్‌లో నిర్మిస్తున్నారు. దీనిలో పనిచేసే కార్మికులకు నివాసాలను ఏర్పాటు చేస్తున్న దృశ్యం.

లండన్ సమీపంలోని ఒలింపియాహాల్లో ఇటీవల నే 83-వ పశుప్రదర్శనం జరిగినప్పుడు, చిత్రంలో వున్న ఆవుకు అనేక బహుమానాలు వచ్చినవి. చూపులలో నేకాకుండా పాలు ఇవ్వటంలో కూడా దీనికి ప్రత్యేకస్థానం లభ్యమైంది. దీనిపాలలో ఏ ఆవుకూ లేనంతగా నూటికి ఆరువంతుల వెన్న వస్తుందట.

ఎలిజబెత్ రాకుమారి కుమారుడు ప్రిన్స్ చార్లెస్, నవంబరు 14 న ఇతనికి మొదటి పుట్టినరోజు పండుగ జరిగింది. ఆ సందర్భంలో వాహ్యాళికి తీసుకొనివెళ్లుతున్న దృశ్యం.

తూర్పు గోదావరి జిల్లాబోర్డు అధ్యక్షుడుగ ఎన్నికైన శ్రీ మారిన నరసన్నగారికి గోకవరంఫిర్కా యర్రపాలెంలో మహమ్మద్ సర్సరాజుగారు విందుచేసినప్పుడు తీసినఫోటో.

## కొల్లేటి లంకగ్రామాల్లో రివెన్యూమంత్రి పర్యటన

కొల్లేటిలంకగ్రామాలు పర్యటించుచున్న రెవెన్యూమంత్రి శ్రీ హ. సీతారామరెడ్డిగారు, శ్రీ మాగంటి బాపినీడు ఎం. ఎల్. ఎ. శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, ఎం. ఎల్. ఏ. శ్రీమతి చో. అమ్మన్నరాజా, ఎం. ఎల్. ఏ. శ్రీ జి. ఏ. నరసింగరావునాయుడు విజయవాడ సూపరింటెండింగు ఇంజనీరు. స్వ. వి.

గౌ. హా. సీతారామరెడ్డిగారు కొక్కెరాల లంకలో లంకగ్రామస్థుల దుస్థితిని వినుచుండుట

లండన్‌లోని ఒక ప్రముఖ వ్యాపారసంస్థ ఈమధ్య ఒకవస్తు ప్రదర్శనాన్ని ఏర్పాటుచేసింది. దానిలో వార్తు వార్తూలానియర్ [illegible] హ్యాండ్ బ్యాగ్ [illegible] పెట్టుకొని ప్రదర్శించారు.

## హైద్రాబాదు సంస్థాన పరిపాలనా నిర్వహణ

### ప్రధానమంత్రిగా వెల్లోడీ నియామకం: నిజాంనవాబు ఫర్మానా

హైద్రాబాద్, నవంబరు 30: 1949 డిసెంబరు 1 నుండి ఎం. కె. వెల్లోడీ ఐ. సి. ఎస్. గారిని ప్రధాన మంత్రిగా నియమిస్తూ నిజాంనవాబు నేడు ఒక ఫర్మానా జారీచేశారు. హైద్రాబాద్ మిలిటరి గవర్నరు మేజర్ జనరల్ చౌధరిస్థానే వెల్లోడీగారు సంస్థాన పరిపాలనాధికారిగా నియమించబడినారు. ఈయన రేపు మొదటినుండి ఛార్జి పుచ్చుకొంటున్నారు. 1949 డిసెంబరు 1 కి పూర్వం మిలిటరి గవర్నరు వుండిన ప్రభుత్వాధికారాల నన్నిటినీ వెల్లోడీగారు నైతేదీనుండి చలాయించవచ్చునని నవాబు తన ఫర్మానాలో తెలియజేశారు.

హైద్రాబాద్ ప్రధాన సివిల్ పరిపాలనాధికారి డి. ఎస్. బాక్లె, ప్రస్తుత ప్రభుత్వంలోని యితర మంత్రులు రేపటినుండి నిజాం మంత్రివర్గంలో మంత్రులుగా నుందురు. నిజాంనవాబు జారీచేసిన ఫర్మానా పూర్తిపాఠం.

"దక్షిణ భారతసైన్య జనరల్ ఆఫీసరు, హైద్రాబాద్ మిలిటరీ గవర్నరుగా నియమించబడిన మేజర్ జనరల్ చౌధరి మిలిటరీ గవర్నరు ఉద్యోగమును 1949 డిసెంబరు 1 నుండి తీసివేశాను. నిరంతర సంస్థాన పరిపాలనను నిర్వహించుటకు వేరొక ఏర్పాటు చెయ్యవలసిన అవసరం ఏర్పడింది. అందుచే ఆ రోజునుండి ఎం. కె. వెల్లోడీగారిని సంస్థాన ప్రధాన మంత్రిగా నియమిస్తున్నాను. డి. ఎస్. బాక్లె, నవాబ్ జైన్‌యార్ జంగ్ బహాదూర్, రాజాధోండీరాజ్ బహాదూర్, రాజసేవాసక్త ఎం. శేషాద్రి, సి. వి. ఎస్. రావు, ఏ. హెచ్. కృష్ణారావుగారలు నా మంత్రివర్గంలో సభ్యులుగా నుంటారు.

1949 డిసెంబరు 1 కి పూర్వం మిలిటరీ గవర్నరుకున్న పరిపాలనాధికారాల నన్నిటినీ, నైతేదీనుండి ప్రధాన మంత్రి చలాయించవచ్చును."

## న్యూజిలెండ్ ఎన్నికలలో ప్రభుత్వ పక్షానికి ఓటమి

### కన్సర్వేటివ్‌ల గెలుపు

వెల్లింగ్టన్, నవంబరు 30: ఎన్నికలలో నేషనల్ (కన్సర్వేటివ్) పార్టీ గెలుపొందడంమూలంగా 14 యేండ్లు నిరాఘాటంగా ప్రభుత్వాధికారాన్ని చలాయించిన లేబర్‌పార్టీ పదభ్రష్టమైపోయినది. నేషనల్‌పార్టీకి 46 స్థానములు లేబర్‌పార్టీకి 31 స్థానములు లభించినవి. లేబర్‌పార్టీలు ప్రభుత్వాలను నిర్వహిస్తున్న మూడు కామన్వెల్తు దేశాలలో (ఆస్ట్రేలియా, బ్రిటన్, న్యూజిలాండ్) మొదటగా ఎన్నికలుజరగడం న్యూజిలాండ్‌లోనే.

## గాంధీజీ విగ్రహ ఆవిష్కరణ

గుత్తి, నవంబర్ 28: మొన్న సాయంకాలం స్థానిక హైస్కూలునందు విద్యార్థులు, ఉపాధ్యాయులు కలసి విరాళములు వసూలుచేసి తెచ్చిన గాంధీజీ విగ్రహ ఆవిష్కరణోత్సవం జరిగినది. ఆ సందర్భమున జరిగిన సభకు జిల్లాకాంగ్రెస్ అధ్యక్షులు రాధాకృష్ణయ్యగారు అధ్యక్షతవహించిరి. అనంతపురం పురపాలక సంఘాధ్యక్షులు పప్పూరు రామాచార్యులుగారు గాంధీ విగ్రహమును ఆవిష్కరించిరి. రామాచార్యులుగారు మాట్లాడుతూ గాంధీజీ ఆశయాలను, ఆయన దక్షిణాఫ్రికాలోనూ, మనదేశంలోనూ ప్రజలకు చేసినసేవను వివరించిరి. ఆయన న్యాయంకోసం శాంతియుతంగా పోరాడెననీ మనం కూడ న్యాయంకోసం ధైర్యంగా పోరాడవలెననీ చెప్పి విగ్రహమును ఆవిష్కరించిరి. అధ్యక్షులు గాంధీజీ ఆశయాలకోసరం మనం నిరంతరకృషి చేయాలని చెప్పిరి. కొందరు విద్యార్థులు బాపూజీపై వ్రాసిన పద్యములు చదివిరి. సి. టి. నీల్‌గారి అభివందనములతో సభ ముగిసెను. ఉదయం గాంధీజీ పటముతో వూరేగింపు జరిగెను. రాత్రి విద్యార్థినులు, విద్యార్థులు రెండు చిన్న నాటికలు ప్రదర్శించిరి.

### డిటెన్యూ విడుదల

మదరాసు, నవంబరు 30: విశాఖపట్నం జిల్లా కమ్యూనిస్టు తెర్లాపు అప్పలకొండ క్షమార్పణ ఇచ్చినందున ప్రభుత్వము విడుదల చేసినది.

## కమ్యూనిస్టు చైనాకు 12 రాజ్యాల అధిక్షేపణ

### ముక్డెన్‌లోని అమెరికన్ కన్సల్ జనరల్ వార్డ్ నిర్బంధ ఫలితం

వాషింగ్టన్, నవంబరు 30: ముక్డెన్‌లోని అమెరికన్ కాన్సల్ జనరల్ అంగస్‌వార్డును, చైనా కమ్యూనిస్టు అధికారులు నిర్బంధించినందులకు, మొత్తం 12 రాజ్యాలు, చైనా కమ్యూనిస్టు ప్రభుత్వానికి అధిక్షేపణ తెలిపినవి.

అమెరికా విదేశాంగశాఖా కార్యదర్శి డీన్ ఎచిసన్ 30 రాజ్యాలకు చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకొని 12 రాజ్యాలు యీ అధిక్షేపణ తెలియజేసినవి.

ఆస్ట్రేలియా, ఆస్ట్రియా, బెల్జియం ఫ్రాన్సు, ఈజిప్టు, ఇండియా, ఇటలీ, నెదర్లాండ్, నార్వే, స్వీడన్, బ్రిటన్, ఫిలిప్పైన్, లు కమ్యూనిస్టు చైనా ప్రభుత్వానికి అధిక్షేపణ తెలిపినవని జవాబులు పంపినట్లు అమెరికా విదేశాంగ శాఖవారు ప్రకటించారు.

బ్రిటన్ మరి 20 రాజ్యాలు యీవిధంగా అధిక్షేపణ తెలుపుటకు సమ్మతించాయని విదేశాంగ శాఖోద్యోగి ఒకరు చెప్పారు.

అంగస్ వార్డ్‌ను, ఆయన సిబ్బందిలో నలుగురిని, ముక్డెన్ ప్రజా న్యాయస్థానం వారు విచారించి చైనా ఉద్యోగిని గాయ కొట్టిన నేరానికి నెలరోజులు శిక్ష విధించారు. తరువాత వారి శిక్షలను రద్దుచేసి, వారిపై దేశబహిష్కార ఉత్తర్వు జారీ చేశారు. వారు కొట్టిన చైనా ఉద్యోగికి పరిహారంక్రింద 62 పౌనులు యివ్వాలని గూడా ఆజ్ఞాపించారు.

### బ్రిటిష్ కంపెనీల ప్రత్యేక సౌకర్యాల రద్దు

ఢిల్లీ, నవంబర్ 29: బ్రిటిషు కంపెనీ లకుమాత్రం, యితర విదేశీకంపెనీలు పేటికి లేకుండా—లోగడ కలుగ జేయబడుతూ వచ్చిన ప్రత్యేక సౌకర్యాలను హక్కులను రద్దుచేస్తూ, 1917 విదేశీ బలామణీ శాసనానికి సవరణగా, ఆహారా మంత్రి జాన్ మత్తయ్ ఈ రోజు పార్లమెంటులో ఒకసవరణ తీర్మానాన్ని ప్రతిపాదించారు.

## భారతరైల్వేల హెచ్చు ఆదాయం

### పార్లమెంటులో ఎన్. జి. అయ్యంగారి వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 30: 1949 సం॥ అక్టోబరుతో అంతమగు పది నెలలలో భారతరైల్వేలు ప్రయాణీకుల మూలమున దాదాపు రూ 70,61,46,489, సరుకుల రవాణా మూలమున రు 1,03,50,96,830 ఆర్జించెను.

1948 సం॥ మున మొదటి పదినెలలలో ప్రయాణీకులమూలమున రు68,53,82,639, సరుకుల రవాణామూలమున 76,54,99,860 లభించి యుండెను.

1948 సం॥ములో రైల్వేలు ప్రయాణీకుల మూలమున రూ 81,89,99,239, సరుకుల మూలమున రూ 94,53,76,959 ఆర్జించెను:

1948 సం॥ములో మూడవ తరగతి ప్రయాణీకులవల్ల 68 95,66,503 రూపాయలు లభించియుండెను. ఈ సంవత్సరం పదినెలలో మూడవ తరగతి ప్రయాణీకులవల్ల 60,04,88,152 రూపాయలు లభించినవి.

## తపాలాబంగీలో మనిషితల

బర్ద్వాంపూర్ (ప. బెంగాల్) నవంబరు 30: నేడు బర్ద్వాంపూర్ తపాలా జవాన్ ఒకడు ఒకబంగీలో మానవ శిరస్సును చూసి కళ్లు తిరిగి పడిపోయినాడు. ఒక బంగీనుంచి చెడువాసన రావటం చూసి అతడు దాన్ని తెరిచి చూశాడు. దాంతో అతడు మూర్ఛపోగా ఆస్పత్రికి చేర్చారు.

మానవశిరస్సు బంగీలో ఉన్నప్పటికీ అది కొత్తహత్యకు సంబంధించినది కాదు. కొన్నాళ్ళక్రిందట కంది (సింహళం)లో ఒక వ్యక్తి హత్య చేయబడగా, రక్తపరీక్ష నిమిత్తం అక్కడి పోలీసువారు అతని తలను కలకత్తా పోలీసు లేబొరటరికి ఈ బంగీలో పంపారు.

### టెండరు నోటీసు

కాకినాడ, రాజమండ్రి, అమలాపురం, పెద్దాపురం, తుని, రామచంద్రపురం, భద్రాచలము (ఏజెన్సీ) వెంకటాపురము (ఏజెన్సీ) లందలి గవర్నమెంటు ఆస్పత్రులకు 1-4-1950 తేదినుండి ఒక సంవత్సరము వరకు, ఆహార పదార్థములు, యితర ఆస్పత్రి సామానులు సప్లయి చేయుటకు సీలువేసిన టెండర్లు 3-1-1950 తేది మంగళవారము మధ్యాహ్నాం 2 గంటలవరకు దిగువ సంతకముదారుచే తీసుకొనబడును.

ఫారముల ఒక్కొక్క సెట్టుకు రు 1/- రుసుము చెల్లించి, దిగువ సంతకముదారు నుండి టెండరు షరతుల కాపీలు, వస్తువుల షెడ్యూలు, అచ్చు ఫారములు పొందవచ్చును. సదరు రుసుము గవర్నమెంటు ట్రెజరీలో "XXVII - Medical Miscellaneous" ఖాతాక్రింద జమకట్టి ఆ చలాను చూపించి ఫారములు పొందవచ్చును.

కాకినాడ. 19-11-49

సి. సీతారామరాజు, ఎం. బి. బి. ఎస్. డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు. తూర్పు గోదావరి.

### టెండరు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

"నార్తు ఈస్టు లైనుమీద ఒంగోలు క్వారివద్ద 2" కంకర రాయి సప్లయి చేయుటకు" సీలువేయబడిన టెండర్లు 19-12-49 తేది సోమవారం పగలు 12 గంటలవరకు మద్రాసు, ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే, చీఫ్ యింజనీరుగారిచే తీసుకొనబడును.

సెట్టు 1-కి పదిరూపాయల వంతున రొక్కము చెల్లించి, దరఖాస్తు చేసినచో, టెండరు ఫారములు యితర డాక్యుమెంట్లు జారీ చేయబడును.

టెండరు 1-కి రు 500/-ల వంతున ముందుగా ధరావతు సొమ్ము చెల్లించవలెను.

## ఐక్యరాజ్య సమితి నుంచి దక్షిణాఫ్రికా నిష్క్రమణ?

### లండన్ రాజకీయవర్గాల అభిప్రాయం

లండన్, డిసెంబరు 1: ఐక్యరాజ్య సమితినుంచి దక్షిణాఫ్రికా వైదొలగ వచ్చునని, యిక్కడి రాజకీయవర్గాలవారు ఊహిస్తున్నారు. ఈ విషయం గురించి "గ్లాస్గో హెరాల్డు" అనే పత్రిక సంపాదకీయం వ్రాస్తూ దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ మాలన్ విధానాన్ని నిశితంగా విమర్శించింది.

దక్షిణాఫ్రికాలో అశాంతికి కారణం తనజాతి విద్వేష విధానమే అయినప్పటికి, యిందుకు విదేశీయుల నిందించడం మలాను బహు తేలికగా కన్పించింది. బయటివారిని నిందిస్తూ గందరగోళంగా యీ ప్రచారం సాగించడం మూలంగా, ఆప్రజా దృష్టి అంతరంగిక సమస్యలపై పడకుండ చేసుకోగలుగుతున్నారు.

## రెవరెండ్ స్కాట్ సాక్ష్యం

### కామన్సులో మేహ్యూవిమర్శ

లండన్, నవంబర్ 30: "నైరృతి ఆఫ్రికాపై ధర్మకర్తృత్వ సంఘం చర్చ జరుపుతూ అక్కడి ఆదిమవాసుల ప్రతినిధినని చెప్పుతున్న రెవరెండ్ స్కాట్ సాక్ష్యాన్ని ఆమోదించటమన్నది చాల ప్రమాదకరమైన దృష్టాంతంగా పరిణమించి ప్రమాదకరమైన పద్ధతికి దారితీస్తుంది. కొంతమంది వ్యక్తుల ప్రతినిధినని చెప్పుకుంటున్న మరొక వ్యక్తి వాదాన్ని వినటానికి సమితి ఉపసంఘమొకటి అంగీకరించినది కనుక, ఈ దృష్టాంతాన్ని చూపుతూ అనేక వర్గాల ప్రతినిధులు తమ ప్రభుత్వాల మీద సమితికి ఫిర్యాదులు చేయటానికి వీలు కలుగుతుంది." అని బ్రిటిష్ విదేశాంగ శాఖా ఉపమంత్రి మేహ్యూ నేడు కామన్సు సభలో విమర్శించాడు.

అటువంటి ఫిర్యాదులను వినటానికి సమితి ఏర్పడలేదని అతడు అన్నాడు.

స్కాట్ సాక్ష్యాన్ని ఆమోదించకూడదని వాదించిన దక్షిణాఫ్రికాను బ్రిటన్ ఎందుకు సమర్థించింది? అని లేబర్ సభ్యుడు విల్కిస్ అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ మేహ్యూ పైవిమర్శను చేశాడు.

విల్కిస్:- జర్మన్ వలస అయిన నైరృతి ఆఫ్రికా పరిస్థితులను నివేదించటానికి దక్షిణాఫ్రికా నిరాకరించినప్పుడు అనధికారుల సాక్ష్యం తప్పితే సమితి అక్కడి పరిస్థితులను తెలుసుకొనటానికి వేరె మార్గం ఏమున్నది?

మేహ్యూ:- అసలు సమస్య అది కేవలం. దక్షిణాఫ్రికాకే సంబంధించినదా లేక సమితిజోక్యం కలిగించుకోవచ్చునా అన్నది. దానిని ప్రపంచ న్యాయస్థానానికి నివేదించ నిశ్చయం జరిగింది.

లిప్టన్ (స్వతంత్ర):- బలహీనులకు అండగా నిలవటమన్న మన సాంప్రదాయాన్ననుసరించి, ఇకముందు ఇటువంటి చర్చ జరుగుతున్నప్పుడు బ్రిటన్ రాజకీయ ప్రయోజనాలను ఆశించక ధర్మాన్నే అనుసరిస్తుందని హామీ ఇస్తారా?

మేహ్యూ: నేను ధర్మా ధర్మాలను గురించి మాట్లాడటం లేదు. సాక్ష్యాన్ని అనుమతించటం ప్రమాదకరమైన పద్ధతికి దారితీస్తుందని మాత్రమే అంటున్నాను.

డ్రైబెర్గ్ (లేబర్):-చట్ట రీత్యా మీరెన్ని సాకులో చెప్పవచ్చును కాని, మనం దక్షిణాఫ్రికాను ఎదిరించి నిలబడనందుకు మన సామ్రాజ్యం అంతటా ఎన్ని విరుద్ధ భావాలు రేగినవో తెలుసా?

మేహ్యూ: ఈ ప్రశ్నకు జనకమన్న అభిప్రాయాలను నేనంగీకరించను.

మికార్డో (లేబర్): సమస్యను ప్రపంచ న్యాయస్థానానికి ప్రతిపాదించాలన్న తీర్మానాన్ని మీరెందుకు సమర్థించలేదు?

మేహ్యూ: అసలుసూత్రంతో మాకు తగాదాలేదుకాని తీర్మానంలో కొన్ని అంశాలు రుచించలేదు.

## వలసదేశాలు-ధర్మకర్తృత్వం

### రెంటికీ సామ్యంలేదని బ్రిటన్ హెచ్చరిక

లండన్, నవంబరు 30: ధర్మకర్తృత్వ నియమాల చాటుగా బ్రిటిష్‌వలస రాజ్యాల వ్యవహారంలో జోక్యం కలిగించుకోవాలని కొందరు ఐక్యరాజ్యసమితిలో ప్రయత్నిస్తున్నారు. ధర్మకర్తృత్వ ప్రాంతాలకూ, వలస రాజ్యాలకూ ఎటువంటి సంబంధ సామ్యాలు లేవని గుర్తించటం వారికి ఇష్టం లేకపోవటమో, లేక గుర్తించలేకపోవటమో దీనికి కారణమై ఉంటుంది." అని బ్రిటిష్‌వలస శాఖామంత్రి లార్డ్ లిస్టోవెల్ నేడు లార్డ్స్ సభలో హెచ్చరించాడు.

ఆఫ్రికాలోని బ్రిటిష్‌వలస విషయమై కన్సర్వేటివ్‌లు ప్రారంభించిన చర్చకు సమాధానమిస్తూ లిస్టోవెల్ పై హెచ్చరికను చేశాడు.

వలసరాజ్యాలపట్ల బ్రిటన్ దృక్పథాన్ని వివరిస్తూ అతడిక్రింది ప్రసంగం చేశాడు.

"ఓడిపోయిన శత్రుదేశాల వలసలను తాను అపహరించినట్లు అపవాదు రాకుండా చేసుకొనేందుకు బ్రిటన్ తన ధర్మకర్తృత్వానికి అప్పగించబడిన ప్రాంతాలమీద తనకుతానే సమితి పర్యవేక్షణను అంగీకరించింది. ధర్మకర్తల పరిపాలనపై పర్యవేక్షణ జరుపుతూ, అవసరమైన విమర్శలు, మందలింపులు, సలహాలునిస్తూ సమితి ఉండవలసినదే కాని ప్రభుత్వ నిర్వహణ విషయంలో ఏమీ జోక్యం కలిగించుకో కూడదు. ఇతరులు జోక్యం కలిగించుకొంటే మేము సహించము.

బ్రిటన్ తన వలసరాజ్యాల ఆర్థిక, విద్యా విషయక సాంఘిక పరిస్థితులను సమితికి నివేదించాలన్న సమితి ప్రణాళికలోని సూత్రాన్ని పురస్కరించుకొని మా సొంత వలసరాజ్యాల విషయంలోకూడా జోక్యం కలగజేసుకొనటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. బ్రిటిష్‌వలసల రాజకీయ, పరిపాలనా పరిస్థితులుకూడా తెలియజేయవలసినదని ఇప్పుడు బ్రిటన్‌ను కోరుతున్నారు. ధర్మకర్తృత్వ ప్రాంతాలను ధర్మకర్తృత్వ సంఘంవలె, వలసరాజ్యాలమీద అజమాయిషీకి మరొక సంస్థను నెలకొల్పాలని కొందరు ప్రయత్నిస్తున్నట్లున్నది.

కాని లార్డ్స్ సభా నిర్వహణను గురించి చెప్పటానికి సమితికి ఎంత అధికారం ఉన్నదో బ్రిటిష్ వలసరాజ్యాల రాజకీయ, పరిపాలన వ్యవహారాలను గురించి చెప్పటానికికూడ అంతే హక్కు ఉన్నది.

ఆఫ్రికన్ వలసరాజ్యాల్లో ఆఫ్రికన్లతో పాటు యూరపియన్లు, భారతీయులు, అరబ్బులు తరాలనుంచీ ఉంటున్నారు. వారందరికీ సమాన హక్కులే ఉన్నవి.

కన్సర్వేటివ్ లార్డ్ ట్వీడ్స్ మ్యూర్ చర్చను ప్రారంభిస్తూ సమితి ధర్మకర్తృత్వ సంఘాన్ని విమర్శించాడు.

### యూనియన్ ఆర్థికమంత్రి విమర్శ

వాకర్స్ట్రూమ్, నవంబరు 30:— యూరోపియన్లు కానివాళ్లను గౌరవంగా చూచినప్పుడు, అంతా ఒక్కత్రాటిమీద నడిచినప్పుడూ మాత్రమే దక్షిణ ఆఫ్రికా విదేశాలవారు తన్నుగూర్చి చేస్తున్న విమర్శలకు సరియైన సమాధానం ఇవ్వగలుగుతుంది అని డా॥ ఆ॥ ఆర్థికమంత్రి ఎన్. సి. హేవెంగా అన్నారు. ఈయన ఆఫ్రికెనార్ పార్టీ నాయకుడు.

దక్షిణ ఆఫ్రికా తనకు తాను మన స్ఫూర్తిగా నడుస్తూ, ఇక్కడి యూరోపియన్లు కానివారుగూడా సుఖంగానే వుంటున్నారు అని చాటగల్గిననాడే పేరు ప్రతిష్ఠలకు పాల్పడగలదని గూడా ఆయన ఈ సందర్భంలో అన్నారు.

## హాంగ్ కాంగ్ - చుంగ్ కింగ్ ల మధ్య వార్తాసంబంధాల విచ్ఛేదం

### చెంగ్టూను కూడా ఖాళీ చేయడానికి చైనా జాతీయ ప్రభుత్వ సన్నాహాలు

హాంగ్ కాంగ్, నవంబరు 30: చుంకింగ్ ఈ వేళ ప్రతిఘటన లేకుండా కమ్యూనిస్టులకు లొంగిపోయిందని, విమానాలలో ఇక్కడికి వచ్చిన జాతీయ ప్రభుత్వోద్యోగులవల్ల తెలుస్తున్నది.

గతరాత్రినుంచిహాంగ్ కాంగ్‌కు, చుంకింగ్‌కు నడుమ వార్తా సంబంధాలు సాంతం విచ్ఛేదమైపోయినవి.

జాతీయవాదులు అప్పుడే చెంగ్టూను కూడా ఖాళీచేయడం అరంభించిరని ఈ ఉద్యోగులు చెప్పిరి.

చెంగ్టూ చుంకింగ్‌కు పశ్చిమోత్తరంగా 200 మైళ్ళ దూరంలో ఉన్నది. జాతీయవాదులు ఇప్పటికప్పుడే 3 రాజధానులు మార్చిరి. వారు మారబోతున్నది నాలుగవ రాజధాని.

పైన జెప్పిన ఉద్యోగులు చెంగ్టూనుండి ప్రత్యేకంగా ఒక విమానాన్ని కిరాయికి తీసుకొని ఇక్కడికి వచ్చిరి. జాతీయ ప్రభుత్వ సభ్యులూ ఉద్యోగులూ చెంగ్టూనుండి తైవాన్‌కు (ఫార్మోసాకు) తరలిపోవడానికి అప్పుడే సన్నాహాలు చేస్తున్నారట.

క్వాంగ్సీ రాష్ట్రంలోని వూఛౌ రేవు పట్టణాన్ని కూమింటాంగ్ సేనలు 3 రోజుల క్రితం పునరాక్రమించుకున్నవని జాతీయ వార్తాసంస్థ ప్రకటించింది.

జాతీయవాదులు టియూనౌనుకూడా పునరాక్రమించుకున్నారని తెలియవచ్చింది అయితే ఈవార్త ఇంకా రూఢికాలేదు.

## చైనా జాతీయ ప్రభుత్వానికి డీన్ అచిసన్ హెచ్చరిక

వాషింగ్టన్, నవంబరు 30: షాంఘై సమీపంలో అమెరికన్ నౌకలపై చైనా జాతీయ ప్రభుత్వనౌకలు దాడిచేయడం అమెరికా హక్కులను భంగపరచడమేనని, అమెరికా విదేశాంగమంత్రి డీన్ అచిసన్ ఈ వేళ ఆరోపించెను. జాతీయవాదుల దిగ్బంధం న్యాయ సమ్మతంగా గుర్తించమని ఆయన విస్పష్ట పరచెను. కాని దిగ్బంధంలో ఉన్న రేవులలోకి అమెరికన్ నౌకలేవైనా ప్రవేశించేట్లయితే అవి తమ తమ రక్షణబాధ్యత తామే వహించవలసి ఉంటుందని ఆయన చెప్పెను.

## హాంకాంగ్‌లో బ్రిటిష్ సేన: మార్షల్ స్లిమ్ ప్రకటన

వాషింగ్టన్, నవంబరు 30: "చైనా కమ్యూనిస్టులు హాంగ్ కాంగ్ మీద తెలివిమాలి దాడి చేయడమే తటస్థించినట్లయితే బ్రిటిష్ సాయుధ సైన్యాలు వారిని పంచబంగళం చేయగలవనడంలో సందేహం లేదు." అని బ్రిటిష్ జనరల్ స్టాఫ్ ప్రధాన సేనాని అయిన ఫీల్డ్ మార్షల్ సర్ విలియమ్ స్లిమ్ యీ వేళ చెప్పెను. హాంగ్ కాంగ్‌లో ఉన్న బ్రిటిష్ సైన్యాలు ఎటువంటి దాడినైనా ఎదుర్కొగలవనీ, తన కుమారుడు హాంకాంగ్‌లో ఉండడంచేత హాంగ్ కాంగ్ రక్షణ విషయంలో తనకు ప్రత్యేకాసక్తి ఉన్నదనీ, ఛలోక్తిగా అనెను.

## జరుసలెం భవిష్యత్తు

### 17 రాజ్యాల ప్రతినిధి సంఘ చర్చ

లేక్ సక్సెస్, నవంబరు 30: జరూసలెం నగర భవిష్యత్ పరిపాలనాపద్ధతి యోచించడానికై నియోగింపబడిన 17 రాజ్యాల ప్రతినిధిసంఘం, యీ వేళ నగర పరిపాలనపద్ధతికి సంబంధించినవి ఎట్టి ప్రతిపాదనలను పరిశీలించిన అనంతరం సమావేశాన్ని వాయిదా వేసుకొన్నది. ఈ సంఘం రేపుగూడా సమావేశమవుతుంది. తనచర్యల పర్యవసానాన్ని నివేదిక రూపంలో, శుక్రవారంనాడు సర్వసభ్య సంఘానికి సమర్పిస్తుంది.

## వియత్నామ్ ప్రభుత్వం జాతీయ సైన్యాలతో సహకరించదు

లండన్, నవంబరు 30: ఇండో చైనాలోని ఫ్రెంచి అధికారులుగాని, బావదాయ్ ప్రభుత్వంగాని చైనా జాతీయవాదులతో సహకరించగోరడం లేదనీ, వారికి ఆశ్రయం ఇవ్వాలన్న ఆలోచనే తమకులేదనీ, ఫ్రెంచి రాయబార కార్యాలయ ప్రతినిధి ఒకడు ఈ వేళ అధికారరీత్యా ప్రకటించెను. అదీగాక ఇండో చైనాకు చైనాకు సరిహద్దున ఉన్న భూభాగం అంతా చాలవరకు డా॥ హోచిమిన్ సైన్యాల ఆధీనంలో ఉన్నది కాబట్టి జాతీయ సైన్యాలు సరిహద్దుదాటి ఇండో చైనాలోకి అధిక సంఖ్యాకంగా ప్రవేశించడంకూడా ఏమంత సంభవం కాదు.

## దూర ప్రాచ్యానికి కమ్యూనిస్టు ముప్పు

### బ్రిటిష్ సహాయానికి జాతీయ చైనా శాసనసభ విజ్ఞప్తి

లండన్, డిసెంబరు 1: చైనాజాతీయ శాసనసభ, బ్రిటిష్‌ప్రభుత్వ సహాయం వేడుతూ దీనాతిదీనంగా ఒకవిజ్ఞప్తి పంపుకొన్నది. దీనిని లండన్‌లోని చైనా రాయబార కార్యాలయంవారు వెల్లడించారు.

బ్రిటిష్ పార్లమెంటులోని ఉభయ శాసనసభలకు, యీ విజ్ఞప్తి పంపబడినది. చైనాలో కమ్యూనిస్టుముప్పు, యావత్తు దూరప్రాచ్యముయొక్క స్వరూపాన్నే మార్చివేయగలదని చెబుతూ, ఈశాన్య రాష్ట్రాల్లోనూ, ఉత్తర చైనాలోనున్న సహజసంపదను కోటానుకోట్ల చైనాప్రజల శక్తిని, చైనా కమ్యూనిస్టు వినియోగించగలిగారంటే, హాంకాంగ్, మలయా, సిలోన్, బర్మా, ఇండియాల కెటువంటి ప్రమాదం సంభవించగలదో ఊహించడానికి కూడా మేము భయపడుచున్నాము అని ఆ విజ్ఞప్తిలో చైనా శాసనసభ్యులు తెలియజేశారు. (గ్లోబ్)

## రైళ్లలో సౌకర్యాలు

### తగ్గింపబడవని భారత రైల్వే మంత్రి హామీ

న్యూఢిల్లీ, నవంబరు 30:— ఈ వేళ పార్లమెంటులో పండిట్ ముకుట్ బెహారీలాల్ భార్గవా వేసిన ప్రశ్నకు సమాధానం చెబుతూ భారత రైల్వే మంత్రి యన్. గోపాలస్వామి అయ్యంగారు రైల్వే శాఖలో పొదుపు విధానం ప్రవేశపెట్టబడినదనీ, అయితే ఈ పొదుపు విధానం అమలులో పెట్టడంవల్ల ప్రయాణీకుల సౌకర్య ప్రణాళికలకేమీ భంగం రావనీ, ఈ ప్రణాళికలకు కేటాయించబడిన ధనం పూర్తిగా వీటికే ఖర్చు పెట్టబడుతుందనీ చెప్పారు. ఈ విషయంలో పూర్వంకంటె గట్టింపు ఎక్కువగా ఖర్చు పెట్టబడగలదని కూడా భారత రైల్వేమంత్రి అన్నారు.

పొదుపు విధానాన్ని గురించి మాట్లాడుతూ గోపాలస్వామి అయ్యంగారు ఇలాగ చెప్పారు. 3, 4, తరగతుల ఖాయపు ఉద్యోగులను ఈ పొదుపు విధానంవల్ల తగ్గించి వెయ్యడం జరగదు. ప్రస్తుతం రైల్వేలలో కొత్తగా ఉద్యోగాలివ్వడం మానివేస్తాము. ఇలాగ చెయ్యడంవల్ల తాత్కాలికోద్యోగులను చాలా మందిని ఆయా శాఖలలో సర్దడానికి వీలవుతుంది. ఈ తాత్కాలికోద్యోగులలో వీలయినంత మందిని ఉద్యోగాలలో ఉంచడానికే ప్రయత్నిస్తాము. 1945 సెప్టెంబరు 15 వ తేదీ తరవాత అదనంగా కొంతమందిని రైల్వేలలో చేర్చుకోవడం జరిగింది. వీరిలో అవసరమైనంతవరకు ఉద్యోగాల్లోనే ఉంచడానికే ప్రయత్నిస్తాము. తీసివేసేటప్పుడు చాలా తక్కువ కాలం ఉద్యోగం చేసినవారితో ప్రారంభిస్తాము.

అయితే కొత్తగా ఇంజనులు తెప్పించడము మొదలైన విషయాలలో ఖర్చు 64 కోట్లనుండి 6 కోట్ల 75 లక్షల దాకా తగ్గించివేశాము. అల్లాగా రైల్వే ఆదాయానికి సంబంధించిన ఖర్చులో 7 కోట్ల 65 లక్షల నుంచి, 1 కోటి, 25 లక్షల వరకు తగ్గింపు జరిగింది. అయితే యుద్ధావసరాలకు ఉపయోగించే రైల్వే నిర్మాణంలో మాత్రం తగ్గింపు ఏమీ జరగదు. పైగా ఈ పని చాలా మురుకుగా గూడా సాగుతున్నది. ఇంక మిగిలిన రైల్వేల నిర్మాణంలో దేశావసరాలనుబట్టి ప్రాముఖ్యం గుర్తించ బడుతుంది."

మరి యొక ప్రశ్నకు వ్రాతమూలకంగా సమాధానం చెబుతూ భారత రైల్వేమంత్రి ఈఆర్థిక సంవత్సరంలో 3 రైల్వే మార్గాలు ప్రారంభించబడతాయనీ 3 రైల్వే మార్గాలు ఇంతకు పూర్వమే ప్రారంభించబడ్డాయనీ చెప్పారు.

## సమితి ఆహారవ్యవసాయ సంస్థ వార్షికసమావేశం రద్దు

వాషింగ్టన్, నవంబరు 30: వ్యయాన్ని మితం చేయాలనే ఉద్దేశ్యంతో, ఐక్యరాజ్యసమితి ఆహారవ్యవసాయసంస్థ ఇకమంచీ, సంవత్సరంవిడిచి సంవత్సరం సమావేశమవడానికి నిశ్చయించింది. ఇప్పటికు యేటేటా సమావేశమవుతున్నది. ఈనిర్ణయంసంబంధి సర్వసభ్యసమావేశంచే ఆమోదింపబడవలసి ఉన్నది.

## రాత్రి విమానా టపా: పార్లమెంటు చర్చ

(4-వ పేజీ తరువాయి)

దనీ, ప్రభుత్వాన్ని విమర్శించే అధికారం ప్రజా ప్రతినిధులకే ఉంటుందని పెట్టుబడిదార్లకు చెప్పాలనీ అన్నారు.

నాజిరుద్దీన్ అహమ్మద్, రాత్రి విమాన టపా, యానమూ చౌకగా ఉన్నవనీ, దీనివల్ల విమాన కంపెనీలకు కలిగేనష్టం విచారించాలనీ, విమాన యానం జాతీయం చేయడంగురించి మాట్లాడడం అప్రస్తుతమనీ అన్నారు.

రవాణాల ఉపమంత్రి ఖుర్షిద్‌లాల్ మాట్లాడుతూ, రాత్రి విమానాలద్వారా రవాణాలు చురుకుగా జరుగుతున్నవనీ, మైలుకు మూడుపాయల గ్యారంటీ ఉండి, మూడున్నరవరకూ తమకు దక్కేలాగున్నా, పైనవచ్చేది ప్రభుత్వంతో పంచుకోవలసున్నా ఉంటే రాత్రి విమానాలు నడపగలమని మంచి కంపెనీలు అన్నదనీ, ప్రస్తుతం వాటికి 3 న్నర గిట్టుతున్నది కనుక నష్టంమాట రాదనీ, రాత్రి విమానాలు నడిపి కొన్ని కంపెనీలకు పక్షపాతం చూపుతున్నట్టు ప్రభుత్వంపై ఆరోపణచేసేవారే రాత్రి విమానాలు నడపడం నష్టదాయకమనడంలో అర్థంలేదనీ, పాం కంపెనీలు తప్పు అంచనాలువేసి ప్రస్తుత కంపెనీలకు 3 న్నర గిట్టడం చూసి లబలబలాడుతున్నవనీ అన్నారు.

పగటి విమానాలు నడిపే కంపెనీలకు ఏమీ నష్టంలేదనీ, ఆకంపెనీలు ఒక వంక రాత్రి విమానాలు నడప నిరాకరించి, మరొకవంక రాత్రివిమానయానాలవల్ల కలిగే లాభం ఆశించడంలో అర్థంలేదనీ, ప్రభుత్వాన్ని లొంగదీద్దామనే దుర్బుద్ధితో ఈ కంపెనీలు కట్టుకట్టినవనీ, ప్రభుత్వంవారు పారిశ్రామికుల సలహాలు వినడానికీ, సహాయం చేయడానికీ సిద్ధంగానే ఉన్నారుగాని అంతిమ నిర్ణయాలు చేయవలసినది ప్రభుత్వమేననీ కూడా ఖుర్షిద్‌లాలు చెప్పారు.

ప్రతిపాదకుడు చర్చకు సమాధానం చెప్పేలోగా సభముగిసి, వాయిదా పడింది.

## ప్రపంచ సౌమనస్య సమావేశం

(1 వ పేజీ తరువాయి)

అడ్డునిలచివున్న మహాశక్తి తొలగిపోయిందని పరితేపపడ్డారు.'

'ఈ నాడు చాలా దేశాల ప్రభుత్వాలు నిర్బంధ సైనిక శిక్షణవిధానాన్ని అమలు జరుపుతున్నారు. ఆ కారణంగా యే వ్యక్తిగాని అహింసా ప్రచారిగా అభిలాష చూపితే ఆయనను దేశద్రోహిగా జమకట్టే దుస్థితి యేర్పడది. మహాత్ముడు అహింసా సూత్రాన్ని కేవలం వ్యక్తిధర్మంగావున్న స్థితిలో నుంచి సాంఘిక రంగంలోకి వ్యాపింప జేశారు. కాని యీ కార్యక్రమాన్ని సాధించటానికి చాలా శిక్షణ అవసరం.

వ్యక్తిబాహ్యతలో పరిమిత పద్ధతిని నిర్వహించబడే అహింసా విధానం, అప్రత్యేక వ్యక్తికి తృప్తినీ, ఆనందాన్ని శాంతినీ యివ్వవచ్చు, కాని అంతమాత్రం చేత ప్రయోజనం లేదు. జాతీయహృదయమంతా పరివర్తన చెంది జాతీయ విధానాలన్నీ మారందే లాభంలేదు.

'అసలు, మానవజాతి, సర్వనాశనం నుంచి తన్నుతను రక్షించుకోవాలను కుంటోందా? అయితే అందుకు సాధనమేమిటి! అహింసా సత్యములలోనూ, అసహాయోద్యమంలోనూ నమ్మకంవున్న మాకందరకూ తోచేసమాధానం ఒక్కటే. సర్వదేశాలు కూడా భారతదేశానికి గల మహా విశ్వాసాలలో భాగం పంచుకుని భారతదేశం నడచిన మార్గాన్ని అనుసరించవలసి వుంటుంది' అన్నారు.

కట్జూగారు ఇంకా ఇలా అన్నారు. 'ప్రపంచం సర్వత్రా నేడు అనేక తీవ్రమైన పరిణామాలు వస్తున్నయ్. ప్రతిదేశంలోనూ అనేక మహాసమస్యలు ఉత్పన్నమౌతున్నయ్. వీటన్నిటికీ మహాత్ముడు ప్రసాదించిన, అహింసా సహాయ నిరాకరణ సూత్రాలు ఏకైక తరణోపాయంగా వున్నయ్. మహాత్ముని సూత్రాలను అమలు జరపాలంటే భయవిరహితులు కావాలి. 'కాని,నేడు ప్రపంచం సర్వత్రా భయభ్రాంతి వ్యాపించివుంది. ఈ భయభ్రాంతిలో ఆత్మరక్షణ కంటూ అనేక సన్నాహాలు సాగుతున్నయ్. ఆత్మరక్షణ అంటే-రయుద్ధాలతో, హింసా విధానం అవలంబించి బాంబులతో ఈ అయుధ విధాన రక్షణను విసర్జించి సర్వదేశాలూ అహింసా విధానాన్ని, సహాయ నిరాకరణ విధానాన్నీ అవలంబించాలని కోరుతున్నాను. నేటి ప్రపంచ సౌమనస్యం యేర్పడటానికి యిప్పుడు ఐక్యరాజ్యసమితి వినా మరో ఆధారమేమీ కనుపించటం లేదు. అక్కడ కూడా గుండుంజీ అయోమయ స్థితియేర్పడుతున్నది. 'భయభ్రాంతి'అనేది వున్నంతకాలం మనం ఆయుధాలకోసం వెంపర్లాడతాం. జాతీయ ఆర్థిక విధానాలను సర్వనాశన పంథాలలో నడిపించుకు పోతూ వుంటాం' అన్నారు.

## "శాంతిస్థాపన కృషి: ప్రపంచవిప్లవం"

### రష్యాకోరేదేమిటని బ్రిటన్ సూటిప్రశ్న

ఫ్లషింగ్ మెడోస్, నవంబరు 30: "సోవియట్ యూనియన్ ప్రపంచశాంతికే ప్రాధాన్యత ఇస్తున్నదా లేక ప్రపంచవిప్లవాన్ని నడపటానికే ప్రాధాన్యతనిస్తున్నదా?" అని బ్రిటిష్‌స్టేట్ మంత్రి మెక్‌నైల్ నేడు సమితి సర్వసభ్యసమావేశంలో సోవియట్ విదేశాంగమంత్రి విషిన్‌స్కీని సూటిగా ప్రశ్నించాడు.

"ప్రపంచశాంతికే ప్రాధాన్యత ఇచ్చేట్లయితే రష్యా ప్రపంచకమ్యూనిస్టు సంస్థను వెంటనే సమావేశపరచి, ప్రపంచంలో అరాజకంకలిగించవద్దనీ, అభ్యుదయ దృక్పథంకలిగిన దృఢప్రభుత్వాలను బలపరచవలసినదని ఆదేశించాలి" అని అతడు సూచించాడు.

శాంతిసాధనకు పశ్చిమ రాజ్యాలు, రష్యా ప్రతిపాదించిన భిన్న పథకాలను గురించి మాట్లాడుతూ మెక్‌నైల్ పై విధంగా ప్రశ్నించాడు.

"రష్యాకు ఇప్పుడు 40 లక్షల సైన్యం ఉంటుంది. మేము మా సేనలను 40 లక్షలనుంచి 7,20,000 కు తగ్గించి వేశాము. రష్యాకు ఎంత సైన్యం ఉన్నదో విషిన్‌స్కీ దయచేసి వెల్లడిస్తాడా? మేము చెప్పిన విషయం నిజమో కాదో ప్రత్యక్షంగా పరిశీలించటానికి మేము సిద్ధమే. మరి రష్యాకూడా దానికి సిద్ధమేనా?" అని అతడు సవాల్ చేశాడు.

అమెరికా బ్రిటన్‌లు సూచించిన శాంతి పథకమే రష్యన్ పథకం కన్నా మెరుగ్గా ఉన్నదని పాకిస్థాన్ విదేశాంగ మంత్రి జఫ్రుల్లాఖాన్ అన్నాడు. రష్యా ప్రతిపాదించినట్లు పంచరాజ్య ఒడంబడిక మాత్రమే యెందుకు, అన్ని దేశాలూ కలిసి చేసుకోరాదా అని అతడు ప్రశ్నించాడు.

పర్షియా ప్రతినిధి మాట్లాడుతూ చర్చిల్, స్టాలిన్, రూజ్వెల్ట్‌లు మధ్య రూతియకు సహాయం చేస్తామని మాట ఇచ్చారనీ, అందువల్ల వారిలో ఒకరి దేశాన్ని -అమెరికాను- తాము అర్థించామనీ అన్నాడు.

## రాజెన్‌బాబు హాజరు కాలేరట

కలకత్తా, డిశంబర్ 1: శాంతినికేతనంలో జరుగుతున్న ప్రపంచ సౌమనస్య సమావేశానికి అధ్యక్షులుగా ఎన్నికైన బాబూ రాజేంద్రప్రసాద్ గారు, తాము ప్రథమ దిన సమావేశాలలో పాల్గొనలేకపోతున్నందుకు విచారాన్ని తెలుపుతూ ఈ దిగువ తంతివార్తను అందజేశారు.

'అస్వస్థత కారణంగా ప్రారంభ దినసమావేశంలో పాల్గొనలేకపోతున్నందుకు విచారించుతున్నాను. వీలైనంత త్వరలో బయలుదేరుతున్నాను. అందరికీ వందనాలు.

## 28 దేశాల నుండి 59 మంది ప్రతినిధులు

ఈ ప్రపంచ సౌమనస్య సమావేశంలో పాల్గొనటానికి 28 దేశాల నుంచి 59 మంది ప్రతినిధులు వచ్చారు. వీరు యావన్మందీ యీ వేళ శాంతి నికేతనమంతా చూస్తున్నారు. ఈ విదేశీయ ప్రతినిధులందరూ యీ వేళ భారతీయ భోజనం చవిచూసి ఆనందించారు.

ప్రతినిధుల వివరాలు:- డేవిడ్ అక్వా; డేవిడ్‌సన్ టెంగొజబావు- పశ్చిమాఫ్రికా మణిలాల్ గాంధీ - దక్షిణాఫ్రికా, ఏ. సి. చారింగ్‌టన్ - న్యూజీలాండ్, టాడ్ చర్ ఆర్. బి. గ్రెగ్, ఓ. మిల్లర్, రేసూటన్, జి. యల్. పెయిన, గ్రేస్ రోడ్స్, ఇగాల్ రూడెంకో, జె. యల్. సేరీ, ఆర్ స్టేలీ, డాక్టర్ మోర్డెకయ్ జాన్సన్ శ్రీమతి వాస్స, శ్రీమతి సేరీ — అమెరికా; రేనీ బోవాట్ - స్విట్జర్‌లాండ్; ఇ ఆర్. బ్రేషా, శ్రీమతి బ్రేషా, వీరా బ్రిటన్ కన్య, ఆర్. రెనాల్డ్స్, విల్ ఫ్రెడ్ విలాక్, వాల్టర్ జాండర్—ఇంగ్లండ్, జె. జె. బర్కెన్ - హాలండ్. జాన్ ఫార్డింగ్ - ఆస్ట్రేలియా, శ్రీమతి కనింగ్‌టన్ - ఐర్లండ్, డాక్టర్ శ్రీమతి కోరా, రివరెండ్ రికినాకయామా పి. యం. సేకియా, - జపాన్, కారల్ హూజర్ - జకొస్లోవేకియా, జార్గన్ సెక్ డెన్మార్క్; హెచ్. క్రష్టుజ్‌కె జర్మనీ; డి. హెచ్. లండ్ నార్వే, జి. పి. మలాలశేఖర - సింహళం; సయ్యద్ నాఫీ — ఇరాన్; హె క్రీ గోజర్, జె. సావర్ లెయున్, శ్రీమతి మూగాస్ ట్రాక్మిఫోన్స; చ్యాసన్స్ టెంగ్, పి. యస్. క్సెంగ్ కన్య-చైనా, ఊలాకిన్-బర్మా శ్రీమతి యూర్సపేటర్స — బెల్జియం; ఎ. ఎ. బి. ఇసాక్, స్వా. కె. లియాంగ్ స్వామి సత్యానంద - మలయా, హెచ్. వై. హసన్ - ఈజిప్టు; ఎల్. బాటిస్టా— ఫిలిప్పైన్స్.

# నానాజాతిసమితి అడుగుజాడలలో ఐక్యరాజ్యసమితి

## సర్వసభ్య సమావేశంలో విషిన్‌స్కీ: పశ్చిమ రాజ్యాల పై ఆరోపణలు

ఫ్లషింగ్ మెడోస్, నవంబర్ 29: "ఐక్యరాజ్యసమితికూడా, పాపం, 'కీర్తి' మాత్రమే శేషించిపోయిన, నానాజాతిసమితి దారినే పోతున్నది" అని సోవియట్ విదేశాంగమంత్రి విషిన్‌స్కీ నేడు సమితి సర్వసభ్యసమావేశంలో హెచ్చరించాడు.

"ప్రపంచ శాంతిని సాధించటానికి సోవియట్ యూనియన్ చేసిన నాలుగు ప్రయత్నాలనూ ఆంగ్లో-అమెరికన్ ఘుటా భగ్నంచేసినవి. యుద్ధప్రోత్సాహకుల దుష్ప్రయత్నాలను నిరోధించేశక్తి ఐక్యరాజ్యసమితికి లేకుండా పోయినదిగనుక నానాజాతి సమితికి పట్టినగతే దీనికీ కూడా పట్టబోతున్నదని చెప్పవచ్చును" అని విషిన్‌స్కీ ఉద్ఘాటించాడు.

రష్యామీద చేయబడిన ఈ క్రింది ఆరోపణలు నిరాధారమైనవనీ, అక్కసు, కొద్ది కల్పించబడినవనీ అతను అన్నాడు.

1. ప్రపంచ కమ్యూనిస్టు విప్లవాన్ని సోవియట్ యూనియన్ సమర్థిస్తున్నది.

2. కమ్యూనిస్టు దేశాలూ, పెట్టుబడిదారీ దేశాలూ శాంతంగా ఇరుగు పొరుగున జీవించటం అసాధ్యమని రష్యావాదిస్తున్నది.

3. మరొక యుద్ధానికి రష్యా పన్నాగం పడుతున్నది.

ఈ మూడు ఆరోపణలనూ వైషిన్‌స్కీ ఖండిస్తూ 1917 నుంచి ఇప్పటి వరకూ శాంతికోసం సోవియట్ రష్యా చేసిన ప్రయత్నాలను ఉదహరించాడు.

### పశ్చిమ రాజ్యాల చర్యలు: యుద్ధ ప్రయత్నాలు

"సర్వత్రా పశ్చిమరాజ్యాల చర్యలను చూడండి. ప్రజాభీష్టాలకు విరుద్ధంగా పశ్చిమ జర్మనీలో వారు నెలకొల్పిన కీలుబొమ్మ ప్రభుత్వానికప్పుడే కళ్లు పడలిపోతున్నవి. మరొక యుద్ధంలో ముఖ్యయుద్ధ స్థావరంగా స్పెయిన్‌ను వారు సిద్ధపరుస్తున్నారు. ఇప్పుడు స్పెయిన్‌లో అమెరికాకు 140 విమానాశ్రయాలు వున్నవి. మాడ్రిడ్ దగ్గర ఉన్న పెద్ద విమానాశ్రయం కూడా అమెరికా చేతుల్లోనే ఉన్నది. ఉత్తర దేశాలు కానిసంగతి అటుంచి అట్లాంటిక్ సముద్రంతో ఏవిధంగానూ సంబంధంలేని టర్కీ, పర్షియాలను వారు ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో చేయుటకు ఇరికించారు? పర్షియా రాజు అమెరికా వచ్చి సైనిక సహాయం అర్థించటంలో అర్థం ఏమిటి?" అని వైషిన్‌స్కీ పశ్చిమరాజ్యాల పథకాలను వివరిస్తూ సవాల్ చేశాడు.

అటంబాంబులను తక్షణం నిషేధించాలని వైషిన్‌స్కీ తీవ్ర ఆవేశంతో ఉద్ఘాటించాడు.

### అమెరికా సమాధానం

అమెరికా ప్రతినిధి వారెన్ ఆస్టిన్ వైషిన్‌స్కీకి సమాధానమిస్తూ ఈవిధంగా అన్నాడు.

"రష్యా ప్రచారపు ఎత్తులను కట్టిపెట్టి పరిష్కారానికి ప్రయత్నించాలని నేను కోరుతున్నాను, అంతర్జాతీయ కమ్యూనిస్టు వర్గం మిగిలిన ప్రపంచమంతటిమీదా కత్తులు దూస్తున్నది. ప్రపంచంలో స్వేచ్ఛగానున్న దేశాలన్నీ సోవియట్ ధోరణులనూ, విధానాలనూ చూసి భయపడుతున్నవి.

రష్యా సూచించినట్లుగా పంచరాజ్య ఒడంబడికకు బదులుగా ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికనూ, బ్రసెల్స్ ఒడంబడిక (పశ్చిమ యూరప్ సమాఖ్య)నూ చేసుకోవలసిన అవసరం ఏమిటో సమితిలో మేము తెలుసుకున్నాము. భద్రతాసంఘంలో రష్యా వీటోను ఉపయోగించి దాని పనిని చేయనివ్వకపోవటంవల్లనే మేము జాగ్రత్త తీసుకోవలసి వచ్చింది."

ఫ్రెంచి ప్రతినిధి షోనల్ ఈవిధంగా అన్నాడు:

"వైషిన్‌స్కీ ఏవో శాంతి సూచనలను చేస్తున్నాడేకాని వాటినెవ్వరూ ఆమో...

## అట్లాంటిక్ రాజ్యాలకు 3 కోట్లడాలర్ల విలువగల ఆయుధ సహాయం

### అమెరికా రక్షణ శాఖామంత్రి ప్రకటన

లండన్, నవంబర్ 29: అట్లాంటిక్ రాజ్యాలకు ఇచ్చే ఆయుధ సహాయంక్రింద ప్రథమ మొత్తంగా అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ అప్పుడే 32,000,000 డాలర్లు మంజూరుచేసినట్లు అమెరికా రక్షణశాఖా మంత్రి లూయీ జాన్సన్ ఇక్కడ జరిగిన పత్రికావిలేఖకుల గోష్ఠిలో తెలియజేశారు. సంయుక్త రక్షణ కార్యక్రమం క్రింద అమెరికా మొత్తం 100 కోట్ల డాలర్లు మంజూరు చేస్తుందన్నారు.

ఇందు క్రింద, అమెరికా, బ్రిటన్లు కాక, ఒడంబడికలోని తక్కిన దేశాలన్నీ కలసి మొత్తం షుమారు 60 కోట్ల వరకూ వ్యయంచేస్తవి.

"మీరు ఇక్కడికి రావటం, బ్రిటన్ రక్షణ బాధ్యతలను కొన్నిటిని అమెరికా చేపట్టేవిషయమై సంప్రదింపులు జరుపటానికేనా?" అన్న ప్రశ్నకు, 'లేదు' అని సమాధానమిచ్చారు.

అట్లాంటిక్ ఒడంబడిక దేశాలు సమగ్ర రక్షణపథకాన్ని తయారుచేస్తే ఈ 320 లక్షల డాలర్లనూ అందజేయుటం జరుగుతుంద అన్నారు.

పశ్చిమ జర్మనీని తిరిగి సాయుధంచేసే విషయం నేనెప్పుడూ యెక్కడా సంప్రదింపులు జరపలేదు అన్నారు.

మనశాంతి భద్రతలకేమీ భంగం లేదని అమెరికా ఎప్పుడు అశ్రద్ధవహించి నిద్రపోదు. శాంతి కావాలంటే బలయుతులమై యుండి తీరాలనే సూత్రంలో నాకు సంపూర్ణమైన విశ్వాసంవుంది అన్నారు.

## టర్కీతో అమెరికా సంప్రతింపులు

ఇస్తంబూల్, నవంబర్ 29: అమెరికన్ విదేశాంగశాఖా సహాయ మంత్రీ, మధ్య ప్రాచ్య వ్యవహారాల శాఖాధికారీ అయిన జార్జ్ మెగీ, టర్కీ నాయకులతో సంప్రదించటానికై రేపు టర్కీ రాజధాని అంకారాకు వెడుతున్నాడు. టర్కీలో అమెరికా రాయబారి వాడ్స్‌వర్త్ ఇతనితో కలిసి వెడుతున్నాడు.

మధ్యప్రాచ్య దేశాలలోని అమెరికన్ ప్రతినిధులు ఇటీవల ఇక్కడ జరిపిన రహస్య సమాలోచనలకు మెగీ అధ్యక్షత వహించాడు. ప్రతినిధులు రాజకీయ, ఆర్థిక, సైనిక, సాంఘిక వ్యవహారాలను చర్చించారని ఇతడు గతరాత్రి చేసిన ప్రకటనవల్ల ఈ సమాలోచనలు ఆగిపోయినట్లు భావించే అవకాశం కలుగుతున్నది.

## సి. పి. మంత్రుల జీతాలతగ్గింపు

నాగపురము, నవంబరు 30: తమజీతములను 10 కి 12½ వంతులు ఐచ్ఛికముగా తగ్గించుకొనుటకు మ॥ రా॥ మంత్రులు అంగీకరించిరి. ఈతగ్గింపు డిసెంబరు 1 తేదీన అమలులోనికి వచ్చునని తెలియుచున్నది. పెద్దజీతములు పుచ్చుకొనుచున్నవారు ఐచ్ఛికముగా జీతములు తగ్గించుకొనవలెనని భారతప్రభుత్వము గావించిన సూచననుసరించి మ॥ రా॥ మంత్రులు జీతములు తగ్గించుకొనిరి. ప్రభుత్వశాఖలలో వ్యయముతగ్గించువిషయము డిసెంబరు మూడవవారమున రాష్ట్రీయ మంత్రివర్గసభలో చర్చకువచ్చును.

## మురుసుమిల్లి హత్యకేసు

### విజయవాడ సబ్ కోర్టులో విచారణ

విజయవాడ, నవంబరు 29: విజయవాడ సబ్ కోర్టులో అడిషనల్ అసిస్టెంట్ సెషన్సుజడ్జి బి. సిహెచ్. నారాయణగారి సమక్షమున 23వ తేదీన "మురుసుమిల్లి హత్య" కేసువిచారణ ప్రారంభమయినది. నేటివరకు 16 గురు సాక్షులు విచారింపబడిరి. వీరిలో 7 గురు, ఈ సంఘటనను ప్రత్యక్షముగా చూచినవారు.

హైదరాబాదు సంస్థాన కమ్యూనిస్టు నాయకులలో నొకడైన మంగపతి నాయకత్వమున, నల్లమల వెంకటేశ్వరరావు, నున్న వెంకటనరసయ్య మొదలైనవారు, 16 ఆగస్టు 1948 నాడు సంస్థాన పరిహద్దులనుదాటి, మురుసుమిల్లి గ్రామములో ప్రవేశించి, ఎ. వి. సూర్యనారాయణరావు అను వ్యక్తిని, మరి ఐదుగురను సంస్థాన పరిహద్దులలోనికి ఎత్తుకొనిపోయి, హింసించి, సూర్యనారాయణరావును కాల్చిచంపినారని కేసుపెట్టబడినది.

పోలీసువారు అరెస్టుచేయదలచిన 20 మంది దాడిదారులలో, మంగపతి, ఎరమల తిమ్మారెడ్డి, సైరెడ్డి కోటయ్య అనుముగ్గురుచిక్కలేదు. వీరుకాక ఇద్దరు దాడిదారులు చనిపోయిరి అందువల్ల 15మందినే స్పెషల్ సబ్ మేజస్ట్రేటుయెదుట విచారణకు తెచ్చిరి. సబ్‍-మేజస్ట్రేట్ గారు ఈ పదిహేనుమందిలో 10 మందిని సెషన్సులో విచారణకు పంపిరి.

అడిషనల్ అసిస్టెంట్ సెషన్సుజడ్జి కోర్టులో మురుసుమిల్లి గ్రామమునసబు కొలూరు వెంకటేశ్వరరావు సాక్ష్యమిచ్చుచూ, తనకు సూర్యనారాయణరావు దూరపు చుట్టమనియు, మంగపతి, సూర్యనారాయణరావుగారికి వ్యక్తిగతశత్రుత్వము కలదనియు చెప్పుచూ, ఈ క్రిందివివరములను తెలిపిరి. సూర్యనారాయణరావు సంస్థాన నివాసి. మంగపతి ముఠావారు, సూర్యనారాయణరావు ఆస్తిని తమలోతాము పంచుకొని, ఆయనయింటిలోనే కమ్యూనిస్టుపార్టీ కార్యాలయమునేర్పాటు చేసిరి. సూర్యనారాయణరావు అంతట యూనియన్ ప్రాంతములకు వచ్చివేసి, తన [మునసబు] ఇంటిలో నివసించుచుండెను. ఆగస్టు 16 నాటిరాత్రి సూర్యనారాయణరావు, వసారాలో నిద్రించుచుండెను. అర్ధరాత్రివేళ కేకలువిని, తలుపు తీయగా, మంగపతిముఠావారు అప్పటికే సూర్యనారాయణరావును పట్టియుంచిరి మంగపతి టార్చిలైటువేసి తనను బెదిరించగా, తాను తలుపు వేసుకొనెను. దాడిదారులు సూర్యనారాయణరావును ఎత్తుకొనిపోయినతరువాత, తాను సకుటుంబముగా ఇంటినుంచి బయటపడి, పోలీసులకీ సమాచారము తెల్పెను. పైలవరం సబ్ ఇన్‌స్పెక్టర్, ఆ తర్వాత, తనను తీసుకునే, మంగపతి ముఠాకు చెందిన 5 తుపాకులను పట్టుకొనెను.

కంచుల సత్యనారాయణ అను దుకాణదారు సాక్ష్యమిచ్చుచూ, భారతప్రభుత్వము హైదరాబాదుపై ఆర్థికదిగ్బంధనము విధించినకాలములో ఒకసారి, మంగపతి, తిమ్మారెడ్డి, నల్లమల వెంకటేశ్వరరావు, తనదుకాణమునుంచి కొన్ని వస్తువులను సంస్థానములోనికి కొనితీసి పోదల్చిరనియు, కాని తను ఆర్థిక దిగ్బంధ నియమానుసారము ఆ వస్తువుల నివ్వ తిరస్కరింపగా, ఆ ముగ్గురు తనను బెదిరించుచూ పోయిరనియు చెప్పెను. 16 ఆగస్టు 1948 నాడు తనను సైరెడ్డి కోటయ్య, వెన్నపూస రామిరెడ్డి మొదలైన [ముద్దాయిలు] వచ్చి సంస్థాన పరిహద్దులలోనికి ఎత్తుకొనిపోయిరి. అక్కడికి సూర్యనారాయణరావుగారు కూడా తీసికొనిరాబడియుండిరి. కొంచెము సేపయిన తర్వాత రెండవ ముద్దాయి నున్న వెంకటనరసయ్య, తన (వెంకటనరసయ్య) తండ్రిని చంపినందులకు కసితీర్చుకొనుటకై అందరనూ చంపివేయుదుననుచూ, స్టెన్‌గన్‌తో ముందుగా సూర్యనారాయణరావుగారిని కాల్చిచంపెను. అదే రాత్రి ఆ చోట, చోడిబోయిన నరసయ్య, వరగల గోపయ్య, గొర్రాజు రాములు, పుయ్యాల నరిసిగాడు, కూనపాటి వెంకట్రామరాజు (ముద్దాయిలు)కూడా యుండిరి.

కొత్తపల్లి రామయ్య సాక్ష్యమిచ్చుచూ, ఈ హత్యాసంఘటనకు పూర్వము, మంగపతి, తిమ్మారెడ్డి, మొదటి ముద్దాయి నల్లమల వెంకటేశ్వరరావు, తనదుకాణము వద్దకు వచ్చి కొన్ని పదార్థములు కావలెననిరి. కాని తను ఇవ్వ నిరాకరించెను. 16 ఆగస్టువాడు తననుకూడా ఎత్తుకొని పోయిరని, పై విధముగనే సాక్ష్యమిచ్చెను.

కె. జమలాపురి, తాను ఆగోజులలో సంస్థానమునుంచి వచ్చివేసి యూనియన్ ప్రాంతములోలదాచుకొనుచుంటిననియు, తననుకూడా దాడిదారు లెత్తుకొనిపోయి పోయిరనియు చెప్పెను.

ఐ. నరసింహయ్య సాక్ష్యము నిచ్చుచూ, తాను కమ్యూనిస్టుల దోపిడీలకు వ్యతిరేకవనియు, మంగపతిముఠా దోపిడీకి గురియైన ఒకనికి తాను సహాయము చేయుచున్నాననీ, బహుశా ఆ కారణంమీదనే తననుకూడా 16 ఆగస్టునాడు ఎత్తుకొని పోయి యుండవచ్చుననియు తెల్పెను.

సీలం లింగిరెడ్డి ఈ సంఘటన నంతయు వర్ణించుచూ, నరసింహపురంవద్ద గాయముతో బాధపడుచున్న నల్లమల వెంకటేశ్వరరావును తాను చూచినట్లు చెప్పెను.

కోటగిరి బుచ్చిబాబుసాక్ష్యమిచ్చుచూ 16 ఆగస్టు అర్ధరాత్రి నాల్గవముద్దాయి వరగల గోపయ్య తనను పిల్చెననెను. తలుపు తీయుటంతలోనే, తలుపుకు అనేక సార్లు తుపాకులు పేల్చబడెను. తాను అంతట తలుపుతీయుటకు సందేహించెను. ఇంతలో మొదటిముద్దాయి నల్లమల వెంకటేశ్వరరావు పేరు చెప్పుకొనుచూ తలుపు వెంటనే తెరువుమని కేకలు పెట్టెను. చివరకు దాడిదారులు తలుపును పగులగొట్టి లోనికి వచ్చిరి. కూలోగా తానొక బరిసెను పుచ్చుకొని, ఒక వీలైనచోట నక్కియుండి తనను పలిపించిన మొదటిముద్దాయిని పొడిచెను. అంతట దాడిదారులు మొదటిముద్దాయిని ఎత్తుకొని, పారిపోయిరి.

ఇవి రంగాచారి-సంస్థాన కాంగ్రెసువాది భూస్వామి—సాక్ష్యమిచ్చుచూ తను గొర్రాజురాములును, నన్నపురాజుని, బట్టా రామయ్యను, పుయ్యాల నర్సిగాడిని 26 ఆగస్టు 1948 నాడు పీవినముగా పట్టుకొనినది వివరించెను. ముద్దాయిలు తనయెదుట తప్పును ఒప్పుకొని తుపాకి మందు గుండ్లు, రక్తపు మరకలైన సద్దులు ఎచట దాచియుంచబడినవో తెల్పిరని చెప్పెను.

ఇంతలో జడ్జీగారు ముద్దాయీలు నెట్లు పట్టుకొనిరో చెప్పుట క్రమ బద్ధమునో కాదో తేల్చవచ్చుననియు, కాని నిందితుల వద్దనుంచి వివరముల నెట్లు లాగిరో చెప్పుట విచారణకు అనవసరమనియు అనిరి.

రాజారావు (హెడ్ కానిస్టేబిల్) సాక్ష్యమిచ్చుచూ, 18 ఆగస్టు 1948 నాడు కంచికచర్లలో మొదటి ముద్దాయి ముద్దాయిలైన, నల్లమల వెంకటేశ్వరరావు నున్న వెంకట నరసయ్య, చోడిబోయిన గోపాలంలను, అరెస్టు చేశానని చెప్పెను. అప్పుడు మొదటి ముద్దాయి గాయముతో నున్నాడు. ముద్దాయిని నందిగామకు పంపితినని రాజారావు చెప్పెను.

నందిగామ మెడికల్ ఆఫీసర్ డా॥ జె. యల్. నరసింహం, ఆగస్టు 18 నాడు నల్లమల వెంకటేశ్వరరావు ఒంటి పై గాయమును చూచితిననియు, ఆగస్టు 16 నాడు తన గాయము ఒరిసెపోటు వలన కలిగినదని నల్లమల వెంకటేశ్వరరావు చెప్పెననియు, తెల్పెను.

ఈ సంఘటన జరిగిన కాలములో మైలవరం పోలీసు సబ్-ఇన్‌స్పెక్టరు గారు ప్రస్తుతము విజయవాడ క్రైమ్ బ్రాంచిలో - పనిచేయుచున్న బి. నారాయణప్పడు నేడు కొంత సాక్ష్యమునిచ్చెను. తిరిగి విచారణ రేపు ప్రారంభమగును.

మొదటి ముద్దాయి తరపున ... జగన్నాథరావు, మిగిలిన ముద్దాయిలకై వి. వి. రాఘవయ్య, ప్రభుత్వము తరపున అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ కపిలచిన వెంకటరావు వాదించుచున్నారు.

## అమెరికాలో విమాన ప్రమాదం

### 27 మంది మరణం: 18 మందికి గాయాలు

డల్లాస్, (టెక్సాస్) నవంబరు 29: ఇక్కడ నేడు ఒక అమెరికన్ విమానం తగులబడి కూలిపోయినందున 27 మంది ప్రయాణీకులు మరణించడము, 18 మంది గాయపడడమూ సంభవించింది. ఒక స్కై-మాస్టర్ విమానం, న్యూయార్క్ నుంచి మెక్సికోకు వెళ్లుతుండగా ప్రమాదం ఏర్పడింది.

### మరొక విమాన ప్రమాదంలో 37 మంది మరణం

పారిస్, నవంబర్ 29: 32 మంది ప్రయాణికులతోనూ, 5 గురు వైమానికులతోనూ వున్న విమానం లాయన్స్ నగర సమీపంలో నేడు కూలి పోయినందున అందులో వున్న వారందరూ మరణించారు. ఇది ఉత్తరాఫ్రికాకు వెళ్లుతున్న విమానం లాయన్సుకు 20 మైళ్ల ఈశాన్యంగా ప్రమాదం సంభవించింది.

## భువనేశ్వర్‌కు రాజాజీ ప్రయాణం

కలకత్తా, నవంబరు 30: గవర్నర్ జనరల్ రాజగోపాలాచారి గారు నేడు విమానంలో ఇక్కడ నుంచి భువనేశ్వర్‌కు (ఒరిస్సా) ప్రయాణమై వెళ్లారు. (యు. ప్రె.

## ప్రధాని నెహ్రూ

నాగపూర్, నవంబర్ 29: భారత ప్రధాని నెహ్రూ డిసెంబరు 31 వ తేదీన నాగపూర్ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ఉపన్యసించడానికి ఇక్కడికి వస్తారు.

# సంఘ క్షేమ దృష్ట్యా గైరుహాజరు భూస్వామ్యవిధానం రద్దుచెయ్యాలి

## హైద్రాబాద్ వ్యవసాయ సంస్కరణల సంఘ నివేదిక: వివరాలు

హైద్రాబాదు నవంబరు 29: సంస్థానంలో వ్యవసాయ సంస్కరణల నిమిత్తం హైద్రాబాదు ప్రభుత్వంచే మైసూరు మాజీ దివాన్ ఎన్. మాధవరావు గారధ్యక్షులుగా నియమించబడిన వ్యవసాయ సంస్కరణల సంఘంవారు ప్రభుత్వానికి కొన్ని సిఫార్సులు చేస్తూ నివేదిక తయారుచేశారు. వ్యవసాయ రక్షణ దృష్ట్యాను, సంఘ రక్షణ దృష్ట్యాను కవులుదార్లు అనులులోకి రావటానికి కారణ భూతమవుతున్న గైరు హాజరు భూస్వామ్య విధానాన్ని రద్దుచెయ్యవలసిందని సంస్కరణల సంఘమువారు ఒక ముఖ్యమయిన సిఫార్సు చేశారు. భూమిదున్నే వాడికే. దాని పైనాజమాన్యం ఉండునట్లు చేయుట, ద్వారా, దున్నేవాడికి, ప్రభుత్వమునకు మధ్య గలవారి నందరిని తొలగించ వలసిందని కూడ వారు సిఫార్సు చేశారు. సంస్కరణ సంఘ నివేదికలో యిట్లు చెప్పబడింది.

పంటభాగంలో జీతమిచ్చి కూలీలచేత వ్యవసాయం చేయించినప్పుడు భూమి యజమానే స్వయంగా వ్యవసాయం చేసినట్లు పరిగణించబడదు. నూతన శాసనం అమలు జరిపే రోజుకు భూమిని సాగుచేస్తున్న కౌలుదార్లను, ఒక సంవత్సరంలో పల ఆ భూమి యజమాని ఆక్షేపణ తెలుపకపోయినచో, వారిని రక్షిత కౌలుదార్లుగా పరిగణించవలెను. రక్షిత కౌలుదారు హక్కులన్నిటికీ వారసత్వపు అవకాశం ఉండవలెను. 1948 జనవరి 1 కి పూర్వంగాని లేక నూతన శాసనం అమలుజరిపే రోజుకు పూర్వంగాని 6 సంవత్సరములకాలం భూమి సాగు చేసినవారందరు రక్షిత కౌలుదార్లకిందకు వస్తారు. 1342 ఫసలీ 1352 ఫసలీలమధ్య ఎవ తెగకుండా సేద్యంచేసి, ఆ తర్వాత వెళ్లగొట్టబడిన కౌలుదార్లు తిరిగి యిప్పుడు తమ హక్కు స్వీకరించుకొనుటకు అవకాశం యివ్వవలెను. ఈ విషయంలో యివ్వబడిన 2 సంవత్సరముల కాలాన్ని 6 సంవత్సరములకు పెంచవలెను. రక్షితకౌలుదార్లు తమ అధీనంలోనున్న భూమిని 8 సంవత్సరములనుండి దానికి యిస్తున్న ముక్తాకు, 12 రెట్లకు మించని ధరకు అమ్మవలసిందని భూమి యజమానులను వత్తిడి చెయ్యటానికి అనుమతించవలెను. ముగ్గురితో కూడిన విచారణసంఘంవారు భూమి ధరను నిర్ణయించవలెను. ఈ విచారణ సంఘంలో 5 సంవత్సరములనుండి ఉంటున్న మునసబుకూడ ఉండవలెను. రక్షిత కౌలుదార్లు కౌలుకు గోలు చేసిన భూములను స్వాధీనం చెయ్యటానికి వీలుండరాదు. ఆభూములను దానం చేయరాదని తనఖా పెట్టరాదనీ అమ్మకం చేయరాదని ఆంక్షపెట్టవలెను.

చెరువులు, కాలువలు మొదలైన వాటి కింద సాగుచేయబడు భూములకుక్తా, మొత్తంపంటలో మూడవవంతు ఉండవలెను. మిగిలిన భూములకుక్తా, మొత్తం పంటలో నాల్గవవంతు ఉండవలెను. భూమి యజమాని స్వంతసేద్యంలో సెలకు రు 150/- ఆదాయం యివ్వగల భూమి ఉన్నప్పుడు అతడు రక్షిత కౌలుదారు కౌలును రద్దుచేసి, భూమిని తనస్వంత సేద్యం కిందకు తెచ్చుకొనటకు అనుమతించరాదు. భూమి యజమాని స్వంత సేద్యంకింద వున్న భూమి సెలకు రు 150/- ఆదాయంయివ్వనిదికాని చో యింకా యెంత భూమి ఉంటేసెలకు రు 150/- ఆదాయం రాగలదో లెక్కవేసి అంత భూమిని మాత్రమే రక్షిత కౌలుదారు నుండి తీసుకొనటకు అనుమతించవలెను. స్థూలంగా తెలంగాణాలో 8 యకరాల మాగాణి, 50 యకరాల మెట్ట, మరాటాలో 50 యకరాల పత్తిపండే భూమి సెలకు రు 150/- ఆదాయం యివ్వగలవని సంస్కరణల సంఘం భావించుచున్నది.

నూతన శాసనం అమలు జరుపబడిన 3 సంవత్సరాలతర్వాత వ్యవసాయ భూములను కవులుదార్లు తిరిగి యింకొకరికి కౌలుకివ్వటాన్ని పూర్తిగా నిషేధించవలెను. భూమి యజమానులు స్త్రీలుగాని, మైనర్లయినప్పుడుగాని, లేక నవసికంగాగాని శారీరకంగాగాని దుర్బలులై వారయినప్పుడు గాని, లేక సైన్యంలోను, నౌకాబలంలోను ఉన్నవారైనప్పుడుగాని, దీనికి మినహాయింపు ఉన్నది.

సేద్యం చెయ్యకుండా యజమానులు బీడుగా ఉంచిన భూముల యాజమాన్యమును ప్రభుత్వం స్వాధీనం చేసు కోవలెను.

రెండు యకరముల మాగాణి, 15 యకరముల మెట్ట భూమిని సంఘంవారు కనిష్ట భూవసతిగా నిర్వచించి యున్నారు. ఇంతకంటె తక్కువ ఉన్నవాటిని నిర్బంధంగానైనా సరే కలిపి పెద్దపెద్దయూనిట్లుగా ఏర్పాటు చెయ్యాలెను. గిట్టుబాటుగాని వ్యవసాయ భూములను సహకార పద్ధతిని సాగు చెయ్యవలెనని సంఘం సిఫార్సు చేస్తున్నది. సెలకు రు 1500 లు ఆదాయం యిచ్చే భూవసతిని అత్యధిక భూవసతిగా నిర్ణయించటమైనది. దీనికెక్కువ ఉన్న భూమిని ప్రభుత్వం బలవంతంగా స్వాధీనపరచుకోవలెనని యీ సంఘం సిఫార్సు చేయుటలేదు.

పై సిఫార్సుల ప్రకారం, పెద్దపెద్ద ఎస్టేట్లు న్యాయమగు ప్రమాణమునకు తగ్గించబడగలవు. 1349 ఫసలీ భూమి అన్యాక్రాంత నిరోధచట్టమును రద్దుచేయవలెననీ, ఎందుచేతననగా యిది మితిమీరిపడిన నిజాం వ్యవసాయదార్లను కొన్ని ముఠాలుగా చీల్చునని సంఘంవారు సిఫార్సు చేశారు.

వ్యవసాయదార్ల ఋణభార పరిష్కారానికి బొంబాయి ప్రభుత్వం అనుసరించిన పద్ధతినే అనుసరించవలెను.

1940 నాటి 'మనీ లెండర్సు' ఆక్టును దృఢతరంగా అమలు జరుపవలెను ... తగ్గా బ్యాంకులు విరివిగా ... కాలంలో సహకార ... సంఘాలు యేర్పాటు చెయ్యాలెనని కూడ సంఘంవారు సిఫార్సు చేస్తున్నారు.

## కమ్యూనిస్టుల ఘాతుకత్వ విజృంభణ

### తెలంగాణాలో వరసగా నాలుగైదు హత్యలు

మహబూబాబాదు, నవంబరు 30: సూర్దేపల్లి గ్రామానికి చెందిన పట్వారీ నరసింహారావు, వెంకట్రామయ్య అనువారిని 29 వ తేదీరాత్రి అచ్యుతయ్య అనువాని నాయకత్వంక్రింద కొందరు కమ్యూనిస్టులు తుపాకీ ప్రేల్చి చంపారు. రివిన్యూ ఇన్‌స్పెక్టరు మహబూబ్‌ఖాన్‌గారు ఏమైనారో ఆచోకీ తెలియటంలేదు. నల్గొండ జిల్లా, జనగాం తాలూకా, మామూడి గ్రామానికి చెందిన కంభం గోపాలరెడ్డిని కమ్యూనిస్టు ముఠా ఒకటి చుండూరు వెంకటేశ్వరరావు నాయకత్వాన ముట్టడించి చంపినట్లు, బోనకల్ - చింతపల్లి మధ్య గూడ్సుబండిని ఆపువేసి ఎస్. బి. సైగాల్ అను రైల్వే ఇంజనీరును హత్య చేసినట్లుకూడ వార్తలు వచ్చినవి. కొంత కాలంగా ఇలా రైళ్ళను అడ్డగించటం జరుగుతున్నది. కమ్యూనిస్టుల ఘాతుకచర్యలు ఈ ప్రాంతంలో ఈమధ్య హెచ్చు రేగిపోతున్నవి.

## ఇండియాలోని సంస్థాన భూభాగాలు

మదరాసు, నవంబరు 30: ఇండియా జిల్లాలలోని సంస్థానభూభాగముల భవిష్యత్తును గురించి చర్చించుటకు ఇండియా ప్రభుత్వము డిశెంబరు 2-న న్యూఢిల్లీలో బొంబాయి హైదరాబాద్, మైసూరు మదరాసు ప్రభుత్వ ప్రతినిధుల సమావేశము ఏర్పరచెను. మదరాసు ప్రభుత్వము తరఫున ప్రధానకార్యదర్శి శ్రీ కె. రామునినాదన్ రేపు బయలుదేరి న్యూఢిల్లీ వెళ్లుచున్నారు.

## రాబడిపన్ను విచారణా సంఘంవారికార్యక్రమం

న్యూఢిల్లీ, నవంబరు 29: 'మొత్తం 260 లక్షల రాబడిపన్ను యెగవేసినట్లుగా తేలిన 93 కేసులను రాబడిపన్ను విచారణాసంఘంవారువిచారించారు. రు. 3,03,333 తిరిగి రాబట్టారు. 65 కేసులు యే విధమైన వత్తిడీ అవసరంలేకుండానే సామరస్యంలో తేలిపోయినై. మరో 1270 కేసులు విచారణలో వున్నయ్! అని ఋజామంత్రి జాన్ మత్తయ్ ఈ వేళ పార్లమెంటు ప్రశ్నోత్తర సమయంలో తెలియజేశారు.

బి దాస్: కొంతమంది పెట్టుబడిదారులూ, బ్లాక్‌మార్కెట్ దారులూ తాము ఎగవేసిన మొత్తాలలో ఏకోశాంతి పుచ్చుకుని రాజీపడమని మీ దగ్గరకొచ్చారట నిజమేనా?

మత్తయ్: నా దగ్గర కెవ్వరూ రాలేదు.

## మద్రాసు ప్రభుత్వానికి ఋణంనిరాకరణ

### మత్తయి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 29: భారత ప్రభుత్వ ఆర్థికమంత్రి డా॥ జాన్‌మత్తయ్ గారు నేడు ఆధినివేశ శాసనసభలో ఒక ప్రశ్నకు సమాధానంస్తూ మద్రాసు ప్రభుత్వం కోరిన 6 కోట్ల రూపాయల ఋణాన్ని కేంద్ర ప్రభుత్వం 1949-50 బడ్జెట్‌లో చేర్చడం లేదనీ అభివృద్ధికార్యక్రమాలకు మద్రాసుప్రభుత్వం పెద్ద ఋణాన్ని చేస్నే కోరలేదనీ తెలిపారు.

## రజకులకు వృత్తి సౌకర్యాలు కల్గించాలి

### విజయవాడ రజక మహాసభ తీర్మానం

విజయవాడ, నవంబర్ 27: విజయవాడ పట్టణ రజకజన సేవాసంఘ 14 వ వార్షికోత్సవము, ఆంధ్రీ యజమానుల సంఘ వార్షికోత్సవము రామమోహన గ్రంథాలయంలో 27-11-49 తేదీన వైభవంగా జరిగింది.

ఆయ్యదేవర కాళేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. సభకు 500 మంది వచ్చారు. ఆంధ్రరాష్ట్ర రజకజన సేవాసంఘ అధ్యక్షుడు పగడాల లక్ష్మయ్య గారు సభను ప్రారంభించారు.

కార్యదర్శి, రజకపత్రిక సంపాదకుడు వేమవరపు వెంకటేశ్వర్లు గారు మాట్లాడిన తరువాత కాళేశ్వరరావుగారు మాట్లాడుతూ, తాను ప్రభుత్వంలో ఉన్నందువల్ల రజకుల న్యాయమైన కోర్కెలు తీర్చటానికి కృషి చేస్తానని, వారుమాత్రం భేదాలు పెట్టుకొని, తగాదా లాడుకొనకుండాను, కమ్యూనిస్టులలో చేరకుండా పని చేసుకోవలసిందని, తన సహాయం చేయటమేగాక, అన్ని విధాల ప్రభుత్వం కూడా తోడ్పడేట్లు చేస్తానని చెప్పారు.

శ్రీ రోయ్యూరు వెంకయ్యగారు, శ్రీ మర్రిపూడి వెంచయ్యగార్లు రజకుల యీతిబాధలనుగూర్చి విపులంగా మాట్లాడారు. తరువాత, ప్రతి గ్రామంలోనుఒక చెరువును వృత్తి సౌకర్యంకొరకు రజకసంఘానికివ్వాలని, రాయలసీమలో రజకులపై జరుగుచున్న దౌర్జన్యచర్యలను అణచి, రజకులకు రక్షణ ఇవ్వాలని, రజక, బాల బాలికలకు ఉచిత విద్యాసౌకర్యం కల్పించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు.

సాయంత్రం ఆంధ్రరాష్ట్ర రజకజన సేవాసంఘ కార్యవర్గ సమావేశం జరిగింది. గుడివాడలో 1950 ఫిబ్రవరిలో ఆంధ్ర రాష్ట్ర రజకజన మహాసభ జరుపుటకు, ఆ సభకు 10 వేల రూపాయలనిధి వసూలు చేయుటకు, "రజకపత్రిక"కు చాటాలు వేయించి ఒక ప్రెస్సు కొనటానికి ఆమోదిస్తూ, ఈ విషయంలో అన్ని వివరములు నివేదించుటకు వేమవరపు వెంకటేశ్వరు (తెనాలి) మర్రెపూడి వెంచయ్య (విజయవాడ) చాటపర్తి రామమూర్తి (అన్నదేవరపేట) సి. ఆదెన్న (తాడిపత్రి) ఓ. సి. కుర్మయ్యగార్లతో ఒక ఉపసంఘాన్ని నియమించారు.

## ఇండియాకు యుగాండా పత్తి అమ్మకం

### లివర్పూల్ వాణిజ్య మండలి నిరసన

లివర్పూల్ నవంబరు 29: యుగాండా (తూర్పు ఆఫ్రికా)లో 1950 సంవత్సరపు పత్తి పంటలో అత్యధిక భాగాన్ని ఇండియాకు బ్రిటిష్ పత్తి పంపిణీ సంఘానికీ అమ్మినందుకు బ్రిటిషవలస శాఖను విమర్శిస్తూ బ్రిటిష్ నేత పరిశ్రమ కేంద్రం లివర్పూల్‌లోని స్థానికవాణిజ్య మండలి నేడు తీర్మానించినది. ఈ తీర్మానం బ్రిటిష్, వలస మంత్రి క్రీచ్ జోన్సు, కు పంపబడుతుంది.

ఈ విధంగా భారీఎత్తున అమ్మటం, వీరి అభిప్రాయం ప్రకారం యుగాండా ఆదిమవాసులకూ, దేశంమొత్తానికీ ఎంతో నష్టం కలిగిస్తుందట.

## పశ్చిమయూరప్ ప్రజా రక్షణ బాధ్యత

### మాంట్‌గొమెరీ ఉద్బోధ

న్యూయార్క్, నవం 29: పశ్చిమరాజ్యాల యూనియన్ సేనాధిపతి సంఘాధ్యక్షుడు ఫీల్డ్ మార్షల్ మాంట్‌గొమెరీ ఈ రోజు అమెరికాఖండ ప్రజలను ఉద్దేశించి ఒక రేడియో ప్రసంగం ఇస్తూ ఈవిధంగా ఉద్బోధించాడు. "పశ్చిమయూరప్ ప్రజలను దండయాత్రబారినుండి కాపాడాలి. దండయాత్ర జరిగినతర్వాత మిమ్మల్ని మేము కాపాడగలమని చెప్పి ప్రయోజనమేమీవుండదు. తూర్పురాజ్యాలు జయప్రదంగా దండయాత్ర సాగించినపిమ్మట వారిని ఉద్ధరించ బూనటకోసం యుద్ధనిరుపయోగమవుతుంది. పశ్చిమ రాజ్యాలపై దురాక్రమణ జరిగితే అక్కడ నివసిస్తున్న ప్రజలజీవితం అంతమైపోయినట్లే భావించాలి. అందుచేత అలాంటిపనిచే జరుగనివ్వకూడదు.

## చుంకింగ్ పతనం

హాంకాంగ్, నవంబరు 30: ఏ విధమైన ప్రతిఘటనా లేకుండానే జాతీయ చైనా తృతీయ రాజధాని చుంకింగ్ నేడు కమ్యూనిస్టు సేనల వశమైనదని ఇక్కడి జాతీయ వర్గాలవారు ప్రకటిస్తున్నారు.

# భారతసేనల దుస్తులలో మార్పు

## అధినివేశశాసనసభలో రక్షణ మంత్రి వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 29: 'నూతన భారత రాజ్యాంగము అమలులోనికి వచ్చిన తరువాత భారత సాయుధదళముల యూనిఫారములలో ముఖ్య మార్పులు జరుగును. పదాతి, వైమానిక, నౌకాదళముల యూనిఫారములనుండి 'రాయల్' అను మాట తీసి వేయబడును' అని ఒక ప్రశ్నకు సమాధాన మిచ్చుచు సర్దార్ బలదేవ్ సింగుగారు నేడు భారతశాసనసభలో ప్రకటించిరి. మార్పుల విషయమై తుది నిర్ణయములు జరుగగానే, ప్రారంభ యేర్పాట్లు పూర్తి కాగానే మార్పుల వివరముల విషయమై ప్రకటన జరుగునని రక్షణశాఖ మంత్రి చెప్పెను.

## త్వరలో భారతదేశానికి మూడు యుద్ధనావలు

న్యూఢిల్లీ, నవంబరు 29: స్వాతంత్ర్యము చేకూరిన తరువాత భారత ప్రభుత్వము వారు 243 లక్షలు ఖర్చు చేసి నౌకాదళమునకు 7 నావలు సంపాదించిరని సిధ్వా గారి ప్రశ్నకు వ్రాత పూర్వకముగా సమాధాన మొసంగుచు భారత శాసనసభలో రక్షణ శాఖ మంత్రి సర్దార్ బలదేవ సింగుగారు చెప్పిరి. ఒకటి రెండు మాసములలో భారతదేశమునకు 8 డిస్ట్రాయర్లు రానున్నవని ఆయన చెప్పెను.

## ఫెడరలుకోర్టు కేసులు

1948 సంవత్సరాంతమున ఫెడరల్ కోర్టులో పరిష్కారము కాకుండా మిగిలియున్న కేసులు 37 అయియుండ 1949 సం॥ నవంబరు 1 తేదీవరకు పరిష్కారము కాకుండా నిలిచియున్న కేసుల సంఖ్య 79 అని సర్దార్ పటేల్ ఒక ప్రశ్నకు వ్రాతపూర్వకముగ సమాధాన మొసంగుచు భారత శాసనసభలో వెల్లడించెను. ఫెడరల్ కోర్టు 1947 సం॥ములో 25 కేసులు 1948 సం॥లో 25 కేసులు పరిష్కరించెనని సర్దారు చెప్పెను.

## చక్కెరధర నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబరు 29: రాబోవు ఋతువులో ఇ-27 రకపు చక్కెర ఫాక్టరీ ధర మణుగుకు రూ. 28-8-0 గా నుండునని భారత ప్రభుత్వమువారు నిర్ణయించినట్లు నేటి ప్రత్యేక గెజెటు తెలుపుచున్నది. వివిధ రకముల చక్కెర ధరలనుగూడ ప్రభుత్వమువారు నిర్ణయించిరి.

## డిసెంబరు 3 న నెహ్రూ రేడియో ప్రసంగం

న్యూఢిల్లీ, నవంబరు 29: డిసెంబరు 3 తేదీ శనివారం సాయంత్రము 8-30 కు ప్రధాని పండిత నెహ్రూ గారు అహార ఆర్థిక సమస్యలను గూర్చి హిందూస్థాన్‌లో బ్రాడ్‌కాస్టు ఉపన్యాసము గావింతురని తెలియుచున్నది. అమెరికానుండి తిరిగి రాగానే ఆయన బ్రాడ్‌కాస్టు చేయునని అనుకొనిరి. కాని ఆయన ఉపన్యాసములను చేయజాలక పోయెను.

## క్రొత్త నాణెములు: కేంద్రప్రభుత్వ పరిశీలన

బొంబాయి, నవంబరు 29: 25 జతల స్వతంత్ర భారతదేశ నాణెములను, తుది నిర్ణయమునకుగాను బొంబాయి టంకశాల వారు కేంద్ర మంత్రివర్గమువారికి పంపిరి. ఇవి తాత్కాలికముగా ఆమోదింపబడియుండెను. ఈ నాణెముల విషయమై మంత్రివర్గమువారు ఈ సంవత్సరాంతములోపుగా తుది నిర్ణయము గావింతురని, జనవరి 26 వ తేదీన వి ప్రదర్శింపబడునని తెలియుచున్నది. ఒకవైపున అశోక స్తంభముకల ఈ నాణెములు రాబోవు ఆగస్టు 15 తేదీనగాని చెలామణిలోనికి రావని తెలియుచున్నది.

## ఫిల్ము సెంసరు బోర్డు

### క్రొత్తసభ్యుల నియామకం

మదరాసు ప్రభుత్వ ప్రకటన యిట్లు గలదు:—

డిశంబరు 8 తేదీనుండి మదరాసు ఫిల్ము సెంసరు బోర్డునందు యీ దిగువ సభ్యులుందురు. ప్రదర్శనమునకు తగు ఫిల్ములను వీరు ఎంపికచేయుదురు:—

పోలీసు కమిషనరు (అధ్యక్షుడు) హోంశాఖ కార్యదర్శి, ప్రచురణశాఖ డైరెక్టరు, (కన్వీనరు) పోలీసు సి. ఐ. డి. సూపరింటెండెంటు, విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టరు, వార్ల వంక వేంకటేశ్వరరావు, ఎల్. కృష్ణమూర్తి, సి. వి. కృష్ణస్వామి, జితేందు బెనర్జీ, తంకమ్మ విశ్వనాథపిళ్లై, శ్రీమతి మంజుభాషిణి, సరోజిని వరదప్ప, మో. సత్యనారాయణ, సి. రామచంద్రన పిళ్లై, సి. వి. హనుమంతరావు, సి. సి. జమశల్లా, పి. బాల సుబ్రహ్మణ్యం, జి. రాజగోపాలనుగార్లు.

# మదరాసుకార్పొరేషను

## ఆర్డినెన్సులైన్సు అభివృద్ధి స్కీము అంగీకరించుట

మదరాసు, నవంబరు 30: మదరాసు కార్పొరేషను నిన్న డా॥ పి. వి. చెరియను మేయరుగారి అధ్యక్షతను సమావేశమయి పురపు ఆర్డినెన్సులైన్సుల ప్రాంతం జాయింటువునులో అభివృద్ధిచేయుట స్కీము సిటీ ఇంప్రువ్‌మెంటు ట్రస్టువారిది ఆమోదించిరి. దీనిపై చర్చ ఒకఘంటసేపు జరిగింది. సిటీ ఇంప్రువ్‌మెంటు ట్రస్టే స్వీకరించింది కాదు కార్పొరేషనుకి డబ్బు చాలదు. కనుక యీ స్కీము అంగీకరించ రాదని చంగల్వరాయనుగారు వాదించిరి. ట్రస్టు కార్పొరేషన కోరి సృష్టించినదే యని కె. వెంకటస్వామినాయుడుగారనిరి. ఆర్డినెన్సులైన్సు ప్రాంతాలు కార్పొరేషను అజమాయిషీ క్రిందలేవు. ఈ స్కీము రూపంలో ఆ ప్రాంతం వశపరచుకోవడం అవసరం. ఖర్చు విషయం యిప్పుడాలోచించవలసిన అవసరంలేదని, కమీషనరు నరసింహంగారనిరి. స్కీము అంగీకరించబడెను.

### పాఠశాలలలో వడుకు నేర్పుట

కార్పొరేషను ప్రాథమిక పాఠశాలలన్నింటియందు విద్యార్థులకు నూలువడుకుట నేర్పుటకు రూ. 5000 ఖర్చును కౌన్సిలు మంజూరు చేసెను. ప్రభుత్వం వారు మరంత డబ్బు యిచ్చెదరు.

డిశంబరులో జరుగు కాంగ్రెసు స్వదేశీ ప్రదర్శనమునందు పాల్గొనుటకు వివిధ శాఖల ఖర్చు రు. 14400 మంజూరు చేయబడెను.

## వ్యవసాయ నూతులకు గడువు

మదరాసు ప్రభుత్వంవారు వ్యవసాయ నూతులకు ధనసహాయం చేయుచున్న మూడు స్కీములందు నూతులు పూర్తి చేయుటకు గడువు 1949 డిశంబరు ఆఖరు, 1950 జూను, 1950 ఆగస్టు ఆఖరులుగా నిర్ణయించబడింది. ఈ గడువులు యికముందు పెంచబడవు. డబ్బు పుచ్చుకున్నవారు అలోగా పూర్తి చేయకున్నచో ఋణములు వాపసు కోరబడును

## ప్రాణదానం

మైలాపూరు ముండకన్ను అమ్మాను వీధియందు ఒక నూతిలో 18 సం॥ యువతి కుప్పమ్మాళు పడిపోగా ఒక పోలీసు జమాను తీసి రాయపేటఆస్పత్రిలో ఐరను లంగ్సు చికిత్సచేయగా, ఆమె బ్రతికెను.

### నెహ్రూ అభినందనము

ప్రధానమంత్రి పండిత జవహర్‌లాలు నెహ్రూ గారికి 61 వ జన్మదినోత్సవము సందర్భమున వారి నభినందించుచు కార్పొరేషను తీర్మానించెను.

### నాల్గు తరగతులు

డిశంబరు 1 వ తేదీనుండి ఎం. ఎస్. ఎం. రైలులో అన్ని మెయిళ్లు ఎక్స్‌ప్రెసులు, విశాఖపట్నం, రాయచూరు ప్యాసింజరులందు నాల్గు తరగతుల ఏర్పాటు అమలు జరుగును.

### ఆదిఆంధ్ర పంచాయితీ

29 తే. ఎస్. రాఘవులుగారి అధ్యక్షతను జరిగిన సభలో ఆదిఆంధ్ర పంచాయితీ కార్యవర్గము 1949-50 సం॥కు యీ దిగువ రీతి ఎన్నుకొనబడెను: అధ్యక్షులు పల్లాల బంగారయ్యగారు; ఉపాధ్యక్షులు సంది పోగు రాఘవులుగారు; ప్రధాన కార్యదర్శి—కర్రా వెంకటస్వామిగారు; సంయుక్త కార్యదర్శి కర్రా కోటయ్యగారు, కోశాధికారి, కర్రా రామయ్యగారు.

కార్పొరేషను జనరలు స్టోర్సుకి 200 డబ్బాల నువ్వులనూనెలో 15% వంతు కొనగనూనె కలిపి సప్లయి చేసినందుకు మాక్సువెలు కంపెనీ యజమానులకు మేజస్ట్రేటుగారు రూ 50 జరిమానా విధించిడబ్బాలు భుక్తపరచుకొనిరి.

ఆ. భా. సహేతుక వాదుల ప్రథమసమావేశము డిశంబరు 18 వ తేదీన రాజాజి హాలులో సర్ ఆర్. ఆర్. పి. పరంజిపె గారి అధ్యక్షతను జరుగునని ఆహ్వాన సంఘాధ్యక్షులు ఎస్. రామనాథనుగారు ప్రకటించుచున్నారు.

కె. ఎల్. నరసింహారావుగారు (విజయవాడ) ఆంధ్ర వాణిజ్య సంఘంనుండి రైల్వే రేట్లు ట్రిబ్యునలు నూనె విస్తులశాఖ సభ్యులుగ ఎన్నుకోబడిరి.

## వాల్టరు లిప్మనుగారు

సుప్రసిద్ధ అమెరికను పత్రికారచయిత జె. వాల్టరు లిప్మనుగారికి భారతపత్రికా సంపాదకుల అధ్యక్షులు, స్వదేశమిత్రను సంపాదకులు సి. ఆర్ శ్రీనివాసనుగారు మంగళవారంనాడు తమ కార్యాలయం విక్టరీ హౌసునందు విందొసంగిరి. ప్రధాన న్యాయమూర్తి న్యాయమూర్తులు, బ్యాంకుల యజమానులు, పత్రికా సంపాదకులు పలువురు వచ్చిరి.

శ్రీనివాసనుగారు స్వాగత మొసంగుచు లిప్మనుగారు ఇండియాకు రెండేండ్ల క్రిందట వచ్చియుంటే, ప్రపంచశాంతికొరకు పాటుబడిన మహాత్ముని చూసియుందురనిరి. లిప్మనుగారు తమను గౌరవించినందుకు కృతజ్ఞతచెల్పుచు మదరాసు చాల అందమయిననగరమని, యిచటజరిగిన ఆతిథ్యాన్ని మరవజాలననిరి.

## గౌ॥ రోష్ విక్టోరియాగారు

గౌ॥ రోషు విక్టోరియాగారు, ఆహారశాఖమంత్రి డిశంబరు 8 నుండి 15 వరకు ఈ ఆర్కాడు, చిత్తూరు, అనంతపురం, బళ్లారి, కర్నూలు, కడపజిల్లాలు సంచారం చేయుదురు. ఆయాచోట్ల ఆహారశాఖ ఉద్యోగులను అధికారులను సంప్రదించి, ఆహార సమస్యలనుగూర్చి చర్చింతురు.

## విమాన దళాధికారి

ఎయిరు మార్షలు సర్. తామను ఎమహారెస్టుగారు, రాయలు ఇండియను విమానదళము కమాండరు ఇన్ ఛీఫ్ డిశంబరు 1 వ తేదీన తాంబరం ట్రెయినింగు సెంటరు, 2 వ తేదీన అవడి ఎక్విప్‌మెంటు డిపో సందర్శించెదరు.

## మంత్రి పెరుమాళ్‌స్వామి రెడ్డిగారు

మదరాసు, నవంబర్ 30: జనరలు ఆస్పత్రిలో చికిత్సనొందుచున్న మంత్రి పెరుమాళ్‌స్వామి రెడ్డిగారిని, నేడు గవర్నరుగారును, సర్జను జనరలుగారును చూచిరి. వీరింకను ఒకవారం ఉండవలసి వచ్చునని తెలియుచున్నది.

## "జరిమానా కాదు"

పొన్నూరు, నవంబరు 28: గుంటూరు జిల్లాబోర్డు సభ్యులు కల్లూరి వీరయ్యగారు యిట్లు తెలియజేశారు.

"నేను కోర్టుకు హాజరుకానందులకు ఒంగోలు జాయింటు మేజిస్ట్రేటుగారు నాకు పదిరూపాయలు జరిమానా విధించినట్లు అక్టోబరు నెలలో ఆంధ్రపత్రికలో ప్రచురించబడినది. నాకు పదిరూపాయలు విధించినమాట నిజమే కాని అది జరిమానాక్రి దకురాదు. నేను యిచ్చినపూచీ కత్తుకుంచి పదిరూపాయలు "ఫర్‌ఫీట్" చేసి నన్ను పదిరూపాయలు రొఖ్ఖం చెల్లించమని ఉత్తర్వులు యిచ్చారు, ఆ ఉత్తర్వులమీద జిల్లాకలెక్టరుగారికి అప్పీలు జేసుకున్నాను. 24 వ తేదీన, అప్పీలులో, జాయింటు మేజిస్ట్రేటుగారి వుత్తర్వులను కలెక్టరుగారు రద్దుపరచినారు."









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, G. T. Madras.